

# అమరవీరుల అడుగుజాడల్లో




సంకలన కర్త

శ్రీ దీనానాథ్ బత్రా

అనువాదం

శ్రీ దోనెపూడి వెంకయ్య





నవయుగ భారతి ప్రచురణలు

హైదరాబాద్

# అమరవీరుల అడుగు జాడల్లో

వైకుంఠ ఏకాదశి
యువనామ సం. పుష్యమాసం
1 జనవరి 1996

**ప్రచురణ :**
నవయుగ భారతి ప్రచురణలు
3-4-705/4, నారాయణగూడ
హైదరాబాద్ - 500 029

**లేజర్ టైప్ సెట్టింగ్ :**
జాగృతి గ్రాఫిక్స్
నారాయణగూడ - హైదరాబాద్

**ముద్రణ :**
భారతి ఆర్ట్ ప్రింటర్స్
1-8-74/2, చిక్కడపల్లి
హైదరాబాద్ - 500 020

**ప్రతులకు :**
సాహిత్యనికేతన్
3-4-852, బరకత్ పుర
హైదరాబాద్ - 500 027

సాహిత్య నికేతన్
ఏలూరు రోడ్
విజయవాడ - 520 002

వెల. 12/-

# మనవి

ప్రపంచ కథా సాహిత్యంలో 'పంచతంత్రం', 'హితోపదేశం' విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకున్నాయి. అలాగే 'ఈసఫ్స్ ఫేబుల్స్' గా పిలువబడే ఈసఫ్ కథలకూ పాఠకుల నుండి మంచి ఆదరణ లభించింది. అలా ప్రాచీన కథల మాదిరి ఆధునిక కాలానుగుణమైన ఎన్నో కథలను, మహాపురుషుల జీవితాలనుండి, చరిత్ర నుండి స్వీకరించి చిన్న పిల్లలకు చెప్తే వారిపై చక్కని ప్రభావముంటుందనటంలో సందేహంలేదు.

శ్రీ దీనానాథ్ బత్రా చాలా కాలంగా విద్యారంగంలో అగణీయమైన కృషి చేస్తున్న వ్యక్తి. తమ అపార అనుభవాన్ని పురస్కరించుకుని,. మారుతున్న సామాజిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని, బాల బాలికలకు స్ఫూర్తిని అందిస్తూ, నైతిక విలువలను బోధించే విధంగా శ్రీ దీనానాథ్ బత్రా కొన్ని చిన్న కథలను సంకలనం చేశారు. వాటిని నాలుగు సంపుటాలుగా హిందీలో ప్రచురించారు. ఆ సంపుటాలకు మాననీయ శ్రీ కె.సి. సుదర్శన్ 'ముందుమాట'ను వ్రాసి ఇచ్చారు.

తెలుగులో ఆ కథా సంపుటాలు ప్రచురిస్తే బాగుంటుందని పలువురు సూచించారు. ఆ సూచన మేరకు తెలుగులోకి అనువదించమని కోరగానే అనువదించి ఇచ్చిన శ్రీ దోనేపూడి వెంకయ్యకు, మూల గ్రంథసంకలనకర్త శ్రీ దీనానాథ్ బత్రాకు, ప్రకాశకులు సురుచి ప్రకాశన్, కొత్తఢిల్లీ వారికి మా కృతజ్ఞతా పూర్వక నమస్కారములు.

- ప్రకాశకులు

ముక్కోటి ఏకాదశి
పుష్యమాసం. యువనామ సం.
**1 జనవరి 1996**

# ముందుమాట

శిశువులకు బాలురకు మనస్సు భావప్రధానంగా ఉంటుంది. సంస్కారాలను గ్రహించేదిగా ఉంటుంది. ఇది ప్రపంచమంతటా అంగీకరింపబడిన విషయం. శిశువులకుగాని బాలురకుగాని మూడేండ్లనుండి పదునాలుగేండ్ల ప్రాయం లోపల ఏయే విషయాలు మనస్సులో చోటు చేసుకుంటాయో, అవే ఆయా వ్యక్తుల స్వభావాన్ని తీర్చిదిద్దటానికి పునాదిరాళ్ళు అవుతాయి. ఇందువల్లనే అన్ని కాలాలలో, అన్ని దేశాలలో సౌశీల్యం నిర్మాణ ప్రక్రియకు అత్యంత శ్రద్ధ వహించబడుతుంది.

స్వభావాన్ని తీర్చిదిద్దే ప్రక్రియలో కథాసాహిత్యానికి అన్నింటికంటె ఎక్కువ ప్రాముఖ్యం ఉంది. చదువను వ్రాయనురాని సంచార జాతులలో , జనజాతులలో సైతం కథలు, గాథల ద్వారానే భావితరాలకు అవసరమైన విధులు, విలువలు తెలుస్తాయి. 'పంచతంత్రం' , 'హితోపదేశం' గురించి అందరికీ తెలుసు. మూర్ఖులైన రాకుమారులను నీతివంతులుగా వ్యవహార కుశలురుగా తీర్చిదిద్దేందుకు అవి రచింప బడ్డాయి. ఆనాటి నుండి ఈనాటివరకు ఈ కథలు ప్రపంచంలో సార్వకాలీనమైన సాహిత్యంలో భాగంగా ఉండి, వ్యక్తి నిర్మాణ ప్రక్రియలో ప్రధానమైన భూమిక నిర్వహిస్తూ వచ్చాయి. వీనితో బాటుగా రామాయణం, మహాభారతం, అష్టాదశ పురాణాలు, జాతక కథలు, భేతాళ పంచవింశతి, ముప్పది రెండు సాలభంజికలు, కథాసరిత్సాగరం మొదలుగాగల అపారమైన కథాసాహిత్యం మనకున్నది. ప్రపంచంలో మిగిలిన దేశాలలో కూడా 'ఈసప్ కథలు', 'అరేబియన్ నైట్స్' ఇత్యాది సాహిత్యం వెలువడింది. ఇవే కాకుండా చారిత్రక సంఘటనలు కూడా వేలాదిగా ఉన్నాయి. వీని ద్వారా పౌరుషం, పరాక్రమం, దయ,క్షమ, కరుణ మొదలగు ఉత్కృష్ట మానవ జీవన మూల్యాలు వెల్లడి అయినాయి. ఇంతేకాదు, జీవితంలో మనకు మార్గదర్శనం చేయజాలిన ఘట్టాలను మనం దైనందిన జీవితంలో కూడా చుట్టుప్రక్కల ఎన్నింటినో ఈనాడూ చూస్తుంటాము. మహాపురుషులు తమ

స్వీయ దృష్టాంతం ద్వారాను, తమ ప్రబోధాలలో ఉదహరించే దృష్టాంతాల ద్వారా కూడా కథాసాహిత్యం ఎంతగానో పరిపుష్టమైంది. కావలసింది ఒకటే. విశాలమైన ఈ కథాసాగరంలో మున్కలువేసి మనకు కావలసిన రత్నాలు వెతకి వెలికి తీయవలసి ఉంది. ఈ పని సులభంకాదు. బాలుర హృదయాలపై చెరగని ముద్ర వేయగల వ్యక్తి మాత్రమే ఇట్టి కార్యంలో కృతకృత్యుడు కాగలడు. శ్రీదీనానాథబత్రా తన జీవితం యావత్తు బాలురను సంస్కారవంతులుగా చేయటంలోనే గడిపిన వ్యక్తి. కురుక్షేత్రంలోని గీతా విద్యాలయాన్ని ప్రాంతంలోని అత్యుత్తమ విద్యాలయంగాను దేశంలోని ఉత్తమ విద్యాలయాలలో ఒకటిగాను రూపొందించిన వ్యక్తి. ప్రస్తుతం దేశంలో నిర్వహించబడుతున్న దాదాపు ఆరువేల శిశు, బాల మందిరాలకు మార్గదర్శనం చేస్తున్న వ్యక్తి. సుదీర్ఘమైన తమ అనుభవం ఆధారంగా వారు ఈ కథా సంపుటాలను సంకలనం చేశారు. బాలురలో అవి తప్పక చక్కని సంస్కారాలను కలిగిస్తాయి.

ఈనాడు ఎటు చూసినా నైతిక విలువలు దిగజారిపోయాయి. హింసాప్రవృత్తి, లంచగొండితనం, కాముకత్వం, స్వార్థం సర్వత్ర తాండవిస్తున్నాయి. ఇట్టి పరిస్థితిలో నైతిక శిక్షణ అనివార్యమయిన విషయం. దీనిలో మరో అభిప్రాయానికి తావులేదు. గట్టి కృషి చేయటం ఒక్కటే అవసరం. భావితరం పట్ల తమకుగల బాధ్యతను గుర్తెరిగి అధ్యాపకులు తమ సదాచరణ ద్వారా చక్కని ఉదాహరణలుగా నిలిచేందుకు ముందంజవేసిన నాడు మాత్రమే ఇది సాధ్యమవుతుంది. అట్టి అధ్యాపకులకు ఈ కథల సంపుటి సహాయకారిగా ఉంటుందని నా విశ్వాసం.

భాద్రపద కృ.5,2051 వి.సం.<br>
26 ఆగష్టు, 1994.

(కుప్.సి. సుదర్శన్)<br>
సహ సర్ కార్యవాహ<br>
రాష్ట్రీయ స్వయంసేవక సంఘ

# ఉపోద్ఘాతం

అత్యంత విశాలమైన సమష్టి తత్త్వ పరిధిలో ఎన్నో అంశాలున్నాయి. వ్యక్తి, కుటుంబము, గ్రామము, సమాజము, రాష్ట్రము, విశ్వము, ఈ సృష్టిలోని సమస్త చరాచరముల నుండి పరమేశ్వరుని వరకు గల సమస్తమూ వీనిలో కలిసి ఉన్నాయి. ఇందులో వ్యక్తి లఘుతమ తత్త్వం. సప్తపదీనమైన ఈ యాత్ర మానవుణ్ణి సంపూర్ణ మానవునిగా చేస్తుంది. 'నర కరనీ కరే తో నర నారాయణ హోజాయ్' (స్వధర్మాచరణం ద్వారా నరుడు నారాయణుడౌతాడు) అనేది ఈ దేశానికి గల ధ్యేయ వాక్యం.

నరుడు నారాయణుడు కాగలడా? లేక ఇది ఒక వ్యర్థమైన ఊహామాత్రమేనా? భారతీయ ఋషులు, మనీషులు, కర్మయోగులు, మేధావులు, తత్త్వజ్ఞులు మానవ జీవితమనే ప్రయోగశాలలో ప్రయోగాలు చేసి ఈ ప్రశ్నకు సమాధానం కనుగొన్నారు. మనకు సుస్పష్టమైన సిద్ధాంతాలను అందించారు. ఈ సిద్ధాంతాలు, నియమాలు, సద్గుణాలు ఆధారంగా వ్యవహరించినట్లయితే మనం జీవితంలో సుఖపడటమే కాదు, ఈ లోకమంతటినీ కూడా సుఖమయం చేయగల్గుతామని వారు ప్రకటించారు. ఈ జీవన మూల్యాలను ఏర్పరచేందుకు వారు ఘోర తపస్సు కావించారు. జ్ఞానాన్ని సంపాదించారు, తదనుగుణంగా జీవించారు. ఈ జీవన మూల్యాలే మన దేశ సంస్కృతీ సారం. అవి మన దేశానికి ఆత్మ.

భరతవర్షం అంటే కేవలం ఒక భూఖండం కాదు. మనకు సరిహద్దులుగా ఉన్న పర్వతాలు, నదులు, సముద్రం, భూమి, అరణ్యాలు - ఇవే భారతదేశం కాదు. ఈభూమిపై నివసిస్తూ ఈ ఉత్కృష్ట సంస్కృతికి వారసులై, మానవ జీవన మూల్యాలకు సంరక్షకులై 'భారత్ నా తల్లి, నేను ఈమెకు పుత్రుడను,' - అనే వారి యొక్క సమాజమే భారత్; విశ్వకళ్యాణ కామనతో ఇతరుల

శ్రేయస్సుకై సర్వస్వార్పణ కావించే మహాత్ములే భారత్, ఆత్మతత్త్వం యొక్క నిగూఢ రహస్యాన్ని బోధించే ఋషి పుంగవులదైన ఈ దేశం భారత్. శిశువులకు ఊగే ఊయల, యువకులకు ఉద్యానవనం, వృద్ధులకు వారాణాసి, మానవత్వానికి రక్షణ కేంద్రం, పుణ్యభూమి, ధర్మ భూమి, కర్మభూమి, దుష్టుల నుండి కాపాడుకోవలసిన భూమి ఈ భారత్. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో మాక్సుముల్లర్ ఈ భూమిని గురించే ఇలా చెప్పారు 'మానవ హృదయంలోని సర్వోత్కృష్టగుణాలు ఏ దేశంలో వికసించాయి? జీవితంలోని గడ్డు సమస్యలను గురించి ఎక్కడ లోతుగా తరచి చూశారు? ప్లేటో, కాంట్ మొదలయిన తత్త్వవేత్తలను గురించి అధ్యయనం చేసేవారు కూడా గమనించతగ్గ సమాధానాలు ఎక్కడ ఇవ్వబడ్డాయి? ఇలా ఒక వేళ నన్ను ఎవరైనా అడిగితే నేను భారత్‌వైపు వేలు పెట్టి చూపిస్తాను'

వ్యక్తి యొక్క వికాసం కోసం సోపాన క్రమంగా ఇక్కడి తత్త్వజ్ఞులు పంచకోశములను కనుగొన్నారు. అవి శరీరము, ప్రాణము, మనస్సు, బుద్ధి, ఆత్మ. ఐదు అంగములనుండి మూలాధారములైన ఐదు మూల్యములు జనించాయి అవి - శక్తి, సంతులనము, సద్విచారము, సత్యాన్వేషణము, సేవ.

అహం నుండి వయం దాకా సలిపే యాత్రను సఫలీకృతమొనర్చేందుకు జీవితంలో సద్గుణ సంపదను ఆర్జించుకోవాలి. తదనుగుణంగా జీవించాలి. ఇది అత్యంతావశ్యకం. జ్ఞానము, ఇచ్ఛ, క్రియ - ఈ త్రివేణీ సంగమం ఆధారంగానే మనిషి ఉన్నతిని పొందేందుకు యోగ్యుడవుతాడు.

జీవన మూల్యాలను సమన్వయ పూర్వకంగా సేకరించి, అవి ఆధారంగా ఆయాఘట్టాలను గ్రహించి సంకలనం చేయబడ్డది. 'ప్రేరణ దీపాలు' ప్రేరణాదాయకమైన సంఘటనలతో కూడిన గ్రంథం. ప్రస్తుత కాలంలో పెద్ద పెద్ద గ్రంథాలను , పుస్తకాలను , జీవిత చరిత్రలను చదివేందుకు, వాటిని మననం

చేసుకొనేందుకు సమయం దొరకటంలేదు. ఈ గ్రంథంలోని ఘట్టాలు చూడటానికి చిన్నవే. కాని ఇవి హృదయాలపై చెరగని ముద్ర వేస్తాయి. 'పిట్ట కొంచెము కూత ఘనము' అని చెప్పవచ్చు.

ఈ గ్రంథ రచనలో ప్రత్యక్షంగాను పరోక్షంగాను అనేకుల సహాయ సహకారములు సమకూరాయి. వారందరికీ నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. 'ప్రేరణ దీపాలు' సంకలనంలో అనేక ధర్మ గ్రంథాలనుండి, పుస్తకాలనుండి, ఉపన్యాసాలనుండి, బోధల నుండి, పత్రికల నుండి విషయం సేకరింపబడింది. వారి పేర్లన్నీ జాబితా వ్రాయటం మొదలుపెడితే అది చాలా పెద్దదవుతుంది, అంతులేకుండా ఇంకా సాగిపోతూనే ఉంటుంది. వారందరికీ కృతజ్ఞతలు సమర్పించుకుంటున్నాను.

పంచవటిలో ఉండగా సీత లక్ష్మణుని అడిగింది, 'శ్రీరాముని చరణాలు, నా చరణాలలో ఎవరి చరణాలు అందంగా ఉంటాయి?' లక్ష్మణుడు చెప్పాడు 'తల్లీ, మీ ఇరువురి అందం ఈ చరణాలలో లేదు, మీ ఆచరణలో ఉంది,' అని చెప్పాడు. వాస్తవానికి వ్యక్తి తన ఆచరణ కారణంగానే విద్వాంసుడౌతాడు. మహాత్ముడౌతాడు.

'ప్రేరణ దీపాలు' అనే ఈ గ్రంథంలోని వ్యక్తులు జీవన పథంలో తమ అడుగుజాడలు మిగిల్చి పోయిన మహాపురుషులు. వారి అడుగుజాడలను బట్టి మనం మన మార్గాన్ని అన్వేషించుకొని ఆ మార్గంలో ముందుకు సాగ గల్గితే ఈ గ్రంథరచనకై చేసిన ప్రయత్నం సఫలీకృతమౌతుంది.

ఇతి శుభం

- దీనానాథ్ బత్రా

సంస్కృతి భవన్
గీతా విద్యా లయ పరిసర్
కురుక్షేత్ర

# వివేకం - శౌర్యం

గాజియాబాద్‌లోని గీతా - సంజయ మెమోరియల్ పబ్లిక్ స్కూలు సంస్థాపకుడు శ్రీ కపూర్ బి. భాన్ తన ప్రాణాలు లెక్క చేయకుండా తన స్కూలు పిల్లలు 14 మందినీ, ముగ్గురు అధ్యాపకురాంళ్ళను రక్షించాడు. పంజాబు - హిమాచల్ ప్రదేశ్ సరిహద్దు వద్ద ఇది జరిగింది.

29 సెప్టెంబరు 1992 నాడు జరిగిన సంఘటన ఇది. స్కూలుకు చెందిన 14 మంది పిల్లలు, ముగ్గురు అధ్యాపకురాంళ్ళతో కలిసి శ్రీ కపూర్ హిమాచలప్రదేశ్‌లో విహారయాత్రకై బయలుదేరారు. యాత్రనుండి తిరిగి వచ్చేటప్పుడు 29 సెప్టెంబరు రాత్రి ఈ బృందం మహీంద్రా వ్యాన్‌లో కుల్లూ నుండి చండీగర్‌కు వెళ్ళారు. తెల్లవారుఝామున 4 గంటలకు హిమాచల్‌ప్రదేశ్ - పంజాబు సరిహద్దు వద్ద వ్యాన్ చెకింగు కోసం ఆగింది - అందరూ నిద్రమత్తులో వున్నారు . వ్యాను డ్రైవర్ మహేంద్ర పత్రాలు వగైరాలు చూపించటానికి బండిదిగి చెక్ వద్దకు వెళ్ళాడు. ఆ సమయంలో వెనుకనుండి వేగంగా ఒక ట్రక్కు వచ్చి ఈ వ్యానును గట్టిగా గ్రుద్దింది. చెక్ పోస్టు వద్ద రోడ్డు మధ్యన ఆగివున్న వ్యాన్ ఒక లోతైన గోతిలో పడబోతున్నది. శ్రీకపూర్ క్షణం ఆలస్యం చేయకుండా క్రిందకి దూకి బండికి ఎదురుగా పోయి నిలుచున్నాడు. డ్రయివరు లేడు. తన రెండు చేతులతో, శరీరంతో వ్యాను ముందుకు పోకుండా ఆపుతున్నాడు. అతని చేతులకు గాయాలు తగిలాయి. అయినా అలాగే వ్యానుమ ఆయన 15-20 అడుగుల దాకా దానితోపాటే పోతూ ఆపే ప్రయత్నం చేస్తున్నాడు. వ్యాన్‌లో వున్న పిల్లలు ఈ భయంకర దృశ్యాన్ని చూసి పెద్దగా కేకలు పెడుతున్నారు.

శ్రీకపూర్ బాగా అలసిపోయాడు. శక్తి నశించి బండి ముందర పడిపోయాడు. అతని శరీరాన్ని త్రోసుకుంటూ వ్యాను ముందుకు పోతున్నది - బండి టైరుకు అతని శరీరం స్పీడుబ్రేకర్‌లాగా పని చేసింది. అందువల్ల బండి ముందుకు పోయే వేగం తగ్గింది.

అది ముందుకు పోయే దిక్కు కూడా మారింది. ఎదురుగా పోకుండా బండి ఇప్పుడు ఎడమవైపుకు తిరిగి కొంత దూరం వెళ్ళి ఆగింది.

అప్పుడందరూ కలిసి శ్రీ కపూర్‌ను ఎత్తుకొని వచ్చి వ్యానులో పడుకోబెట్టారు. ఆయన రెండు కాళ్ళు, ఎడమ చేయి బాగా దెబ్బతిన్నాయి. శరీరం అంతా దోక్కొనిపోయింది. గాయాలయినాయి. వెంటనే చండీఘడ్ ఆసుపత్రిలో ప్రాథమిక చికిత్స ఆయనకు చేయించి, గాజియాబాద్ తీసుకొని వెళ్ళారు.

శ్రీ కపూర్ వివేకం వల్ల శౌర్యం వల్ల చాలా ప్రాణాలు రక్షింపబడ్డాయి.

# పరాక్రమానికి పురస్కృతి

రాజస్థాన్‌లోని పాలీ జిల్లా, సేదడా గ్రామ నివాసి గంగారామ్ ప్రజాపతికి 1992 వీరతా - పురస్కారం లభించింది. అతడు తన ప్రాణాలు లెక్కచేయకుండా 70 అడుగుల లోతు గల బావిలోకి దూకి కిషన్‌లాల్ అనే వ్యక్తి ప్రాణాలు కాపాడాడు. ఆ బావిలో వాటర్ వర్క్స్ వారి మోటారు , పైపులు కూడా బిగించివున్నాయి.

అజ్మీర్‌కు సమీపంలో వున్న సేదడా గ్రామంలో ఈ సంఘటన జరిగింది. ఈ గ్రామం వ్యావర్‌కు 15 కి.మీ. దూరంలో వుంది. ఇక్కడ రైల్వే లైనుకూ, రోడ్డుకూ నడుమ వంద మీటర్ల దూరం కూడా లేదు. సేదడాలో రైల్వే స్టేషను,

బస్ స్టాండు రెండూ వున్నాయి. అందువల్ల బజారు సందడిగా వుంటుంది. ఇదే బజార్లో జాగేశ్వర మహాదేవుని దేవాలయం ఉంది. దానికి ఎదురుగా గంగారామ్ ప్రజాపతి దుకాణం వుంది. దేవాలయం దగ్గరే బావి ఉంది.

**24** సెప్టెంబరు **1992** నాడు జరిగిన సంఘటన ఇది. బయట బాగా చలిగా వుంది. జనులు తమ ఇండ్లలో ఎవరి పనిలో వారు మునిగా వున్నారు. అకస్మాత్తుగా ధామ్మని పెద్ద శబ్దం వినిపించింది. కిషన్‌లాల్ అనె వ్యక్తి రోడ్డుకి ఎడమవైపు **50** అడుగుల దూరంలో వున్న ఆ బావిలో పడిపోయాడు. అతనికి ఒక కన్ను కనిపించదు. శబ్దం విని అందరూ ఆ బావివద్ద చేరారు. కిషన్‌లాల్ నీటిలో మునిగిపోతున్నాడు. ఏమి చేయటానికి పాలుపోక అంతా అలా చూస్తూ నిల్చున్నారు. అతన్ని రక్షించడానికి ఎవరూ సాహసించి ముందుకు రాలేకపోయారు.

ఇంతలోనే ధామ్మని మరల శబ్దమయింది. ఆ చీకట్లో నిండు బావిలోకి దూకాడు నిర్భయుడు సాహసవంతుడు అయిన గంగారామ్ ప్రజాపతి.

గంగారామ్ మునిగిపోతున్న కిషన్‌లాల్‌ను పట్టుకొన్నాడు. కిషన్‌లాల్‌కు స్పృహ లేదు. వాటర్ వర్క్స్ వారిపైపును పట్టుకొని నిల్చున్నాడు గంగారామ్. పైన వున్న వారితో త్రాడు వేయమని కేకవేసి చెప్పాడు. పై నుండి త్రాడు వేశారు. గంగారామ్ త్రాడు సాయంతో కిషన్‌లాల్‌తో సహాక్షేమంగా పైకి వచ్చాడు. ఈ ప్రమాదంతో కిషన్‌లాల్ కుడికాలి ఎముక విరిగింది.

గంగారామ్ ప్రజాపతి తన ప్రాణాలకు తెగించి కిషన్‌లాల్‌ను రక్షించాడు. ఇది ఒక మంచి ఉదాహరణ. గ్రామస్థులు **26** జనవరి **1993** నాడు రిపబ్లిక్ దినం సందర్భంగా జరిగిన సమావేశంలో గంగారామ్ ప్రజాపతికి తలపాగా పెట్టి గౌరవించారు. వెండి పతకం కూడా ఇచ్చారు.

# విద్రోహులతో పోరాటం

ఎనిమిది మంది నిర్దోషులను పంక్తిలో నిలబెట్టి తుపాకులు గురిపెట్టి కాల్చి చంపేందుకు ఒక విద్రోహి ప్రయత్నిస్తుండగా ఒక వ్యక్తి నిరాయుధుడై అతని పై దాడి చేశాడు. అతని చేతిలో ఎ.కె. 47 రైఫిల్ లాక్కున్నాడు. ఈ సాహసకృత్యం చేసిన వ్యక్తి పేరు జస్వంతసింహుడు.

తన ప్రాణాలను కూడా లెక్క చేయకుండా ఎనిమిది మంది జీవితాలను రక్షించిన ఈ సాహస కార్యం 25 జూన్ 1992 నాడు జరిగింది. పంజాబులోని గురుదాస్‌పూర్ జిల్లాలో నౌషీరా మజ్జాసింహ అనేచోట ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ఉన్నది. జస్వంతసింగ్ అందులో పనిచేస్తున్నాడు. ఆ రోజు కార్యలయానికి వచ్చాడు. అక్కడ నలుగురు మహిళా ఉద్యోగులు, ఇరువురు పురుషోద్యోగులు ఉన్నారు. ఒక మహిళా ఉద్యోగి వెంట ఒకటిన్నర ఏండ్ల పిల్లవాడు కూడా వున్నాడు. వీరంతా కూర్చొని తేనీరు సేవిస్తున్నారు. ఆ సమయంలో 24-25 ఏండ్ల సిఖ్ఖు యువకుడు ఒకడు సైకిల్ మీద అక్కడికి వచ్చాడు. ఆరోగ్యకేంద్రం డాక్టరును గురించి అడుగసాగాడు. అతడు అమర్యాగకరమైన భాషలో మాట్లడటం చూచి అక్కడ ఉన్న మహిళా ఉద్యోగి, నీకు మాట్లాడేపద్ధతి కూడా తెలీదా? అని అన్నది. ఇది విని ఆయువకుడు, ఇప్పుడే మీ అందరికి తగిన బుద్ధి చెబుతాను అని చెప్పి సైకిల్ దగ్గరకు వెళ్ళి ఒక గోనె సంచి తెచ్చాడు. అందులో నుండి ఒక ఎ.కె. - 47 రైఫిల్ బయటకు తీశాడు.

అక్కడ ఉన్న వారందరిని ఒక పంక్తిలో నిలబడమని రైఫిల్ చూపించి ఆదేశించాడు. మహిళా ఉద్యోగి తన పిల్లవానితో సహా గదిలోనుండి బయటకు పారిపోవటానికి ప్రయత్నించింది. అతడు ద్వారానికి అడ్డంగా నిల్చొని, ఎవరైనా పరుగెత్తి పోదామని ప్రయత్నించారో జాగ్రత్త! మొదటి గుండుతో వారినే

చంపేస్తాను. అందరూ భయంతో గడగడలాడిపోయినారు. మహిళా ఉద్యోగి కాళ్ళావేళ్ళా పడి అతనిని బ్రతిమలాడసాగింది. నన్ను పోనీ, నా పిల్లవాడు ఏడుస్తాడు అని ప్రార్థించింది. కాని అతను లెక్క చేయలేదు. ఇదంతా జరిగే సరికి 40- 50 సెకన్లు పట్టింది.

ఈలోగా జస్వంత్‌సింగ్ తేరుకున్నాడు. ఒకవేళ మరణించవలసి వస్తే ఏదైనా చేసి మరణిద్దామనుకున్నాడు. కన్నుమూసి తెరచేలోగా ఆ యువకుని మీదకు లంఘించి అతని వద్దనున్న రైఫిల్ లాక్కున్నాడు. ప్రక్కనున్న ఇద్దరూ కూడా అతనికి సాయపడ్డారు. అంతా కలిసి ఆ యువకుని చిత్తు చేశారు. ఐనాకూడా ఆ వచ్చిన విద్రోహి ఎలాగో తప్పించుకొని పారిపోగలిగాడు. అతను తెచ్చిన గోనె సంచీలో 271 తూటాలు, తదితర సామాగ్రి దొరికాయి. అన్నింటిని ఘాటీవాల్ పోలీస్టేషన్‌లో అప్పగించారు.

# ప్రేమ నాస్తికతను పోగొడుతుంది.

ఆచార్య హరిద్రుమతుడు గాంధార దేశానికి వెళుతున్నారు. ఆయన అక్కడ ఒక యజ్ఞాన్ని నిర్వహించవలసి ఉంది. త్రోవలో ఒక గ్రామముంది. అక్కడ అందరూ దైవభక్తులు, ఆధ్యాత్మవాదులు, ఆస్తికులు. ఆయన వెళుతుండగా ఒక బాలుని ఏడ్పు వినిపించింది. ఒక తల్లి తన పిల్లవాడిని దండిస్తున్నది. హరిద్రుమతుడు ఆగాడు. పిల్లవానిని దండించడానికి కారణం ఏమిటని అడిగాడు. 'మహాత్మా, ఏమని చెప్పేది! ఈ గ్రామంలో ఈ నా కుమారునికి ఒక్కనికే భగవంతునిమీద నమ్మకంలేదు. వీడు నాస్తికుడు ఇందువల్ల ఊళ్ళో మమ్ములను వెలివేశారు. మాకు చెడ్డపేరు వచ్చింది. నాకు కోపం రాదా? చెప్పండి?'

హరిద్రుమతుడు చెప్పాడు, 'అమ్మా! లోపాలు ఏవైనా ఉంటే ప్రేమతో సరిదిద్దవచ్చు, క్రోధంతో కాదు. ఈ బాలునికి అత్యంత ప్రేమతో, ఆత్మీయతతో శ్రద్ధగా తెలియచేయాలి, నాస్తికత్వాన్ని తొలగించాలంటే ఇది ఒకటే మార్గం' ఇలా చెప్పి ఆచార్యులు ముందుకు వెళ్ళారు.

అప్పటి నుండి ఆబాలుణ్ణి తల్లితండ్రులు ఎంతో ప్రేమగా పెంచారు. తత్ ఫలితంగా ఆ బాలుడు పెద్దవాడై మహాజ్ఞాని యైనాడు. ఉద్దాలక మహర్షి అను పేరుతో ప్రసిద్ధికెక్కాడు. విద్యా బోధనలో ఇదే సరియైన పద్ధతి. ఉత్తమ వ్యక్తిత్వంగల మనుషులు అప్పుడే తయారౌతారు.

# గోవు సత్య నిష్ఠ

అది ఒక మంచి ఆవు. ఎంతో తెల్లగా ఉండేది. తోక, కొమ్ములు, పాదుగు, నాలుక అన్నీ తెలుపే. అందంగా ధృఢంగా ఉండేది. దానిపేరు నంద. ఒక రోజున అది అడవిలో తిరుగుతూ ఆవులమందలో నుండి తప్పిపోయింది.

మధ్యాహ్నానికి ఆ ఆవుకు దప్పిక వేసింది. నీటకై సరస్సు వద్దకు వెళుతున్నది. త్రోవలో ఒక సింహం ఎదురైంది. సింహాన్ని చూచి, ఆవు ఆగిపోయింది. దాని కన్నుల నుండి అశ్రుకణాలు రాలసాగాయి.

'ఏడుస్తావెందుకు? నీవు శాశ్వతంగా ఉండలేవుకదా? వృద్ధాప్యం వల్లనో, వ్యాధి వల్లనో ఎప్పుడో ఒకప్పుడు చచ్చిపోవలసిందే. నేను నిన్ను కష్టం లేకుండా శీఘ్రంగా చంపేస్తాను' అని సింహం చెప్పింది.

ఆవుకి కాస్త ధైర్యం కలిగింది. అది ఇలా అంది,

'నీవు మృగరాజువు. వన రాజువు. నీవు అనుమతిస్తే నా విన్నపం ఒకటి

ఉంది. నేను నా కోసం దుఃఖించటం లేదు. జన్మించిన ప్రతి జీవి మరణించవలసిందే అని నాకు తెలుసు.

'మంచిది నిన్ను నేను వదలిపెట్టేది లేదు. నీవు చెప్పదలచుకున్నది వెంటనే చెప్పు'.

ఆవు చెప్పింది, 'నాకు ఒక బిడ్డ ఉంది. అది నా మొదటి కాన్పు. దానికి ఇంకా గడ్డి మేసే వయసు రాలేదు. నా బెంగ అంతా దానిగురించే. నాకు కాస్త సమయం ఇస్తే వెళ్ళి చివరిసారిగా దానికి పాలిచ్చి వస్తాను. దాని శిరస్సు ముద్దాడి తోటివారికి అప్పగించి వస్తాను. ఈ మాత్రం దయ తలచవలసిందిగా కోరుతున్నాను'. సింహం ఇలా చెప్పింది, 'నా దగ్గర నీ తెలివి తేటలు ప్రదర్శించకు, నీవు నన్ను మోసగించలేవు. చేతికి చిక్కిన ఆహారాన్ని నేను వదలి పెడతాననుకుంటున్నావా?'

ఆవు సత్యం మీద ప్రమాణం చేసింది. సింహం దాని మాటలు విశ్వసించింది. చూద్దాం . ఇది తన ప్రతిజ్ఞని ఏమాత్రం నిలుపుకుంటుందో? ఒక్క రోజు భోజనం లేకపోతే పోయిందేమీలేదు అని అనుకుంది.

సింహం వద్ద అనుమతిపొంది గోవు తన గృహానికి వచ్చింది. దూడకు పాలు ఇవ్వసాగింది. ఆ సమయంలో ఆమె కన్నీరు కారుస్తోంది. తల్లి దుఃఖానికి కారణం అడిగింది దూడ. తల్లి చెప్పిన వివరాలు విని, నేను కూడా నీతో వస్తాను అని చెప్పింది.

తక్కిన ఆవులు నందా గోవుకు తన ప్రాణాన్ని రక్షించుకోమని చెప్పాయి. అనేక యుక్తుల ద్వారా, ఉదాహరణల ద్వారా ప్రాణ రక్షణకై అబద్ధమాడ వచ్చునని వాదించాయి. సింహం వద్దకు వెళ్ళ వద్దని బోధించాయి.

నందా గోవు ఇలా చెప్పింది, 'ప్రతి ప్రాణి ఒకనాడు తప్పక మరణించవలసిందే. దేహం అశాశ్వతం, దీనికోసం నేను మాటతప్పను. సత్యాన్ని రక్షించి తీరుతాను. ప్రతి ప్రాణికి ఇది ఉత్తమ ధర్మం'. ఆవు తన బిడ్డకు పాలిచ్చింది. ముద్దాడింది. తక్కిన ఆవులకు అప్పగించింది. ఇక బయలుదేరింది, దూడ ఆగలేకపోయింది. అది కూడా తల్లి వెంట పరుగెత్తుకొని వెళ్ళింది. నందాగోవు సింహం దగ్గరకు చేరింది. దూడ తన తల్లికి సింహానికి నడుమ నిల్చింది. నందాగోవు ఇలా చెప్పింది, 'మృగరాజా, నేను తిరిగి వచ్చాను. అమాయకురాలైన నా బిడ్డను చంపవద్దు. నన్ను చంపి నీ ఆకలి తీర్చుకో'.

సింహం గోవు యొక్క సత్య నిష్ఠకు సంతోషించి ఇలా చెప్పింది, 'కళ్యాణమయీ, సత్యం పైన స్థిరంగా ఉన్న వారికి ఎవరూ అపకారం చేయలేరు, నీవు నీ దూడతోపాటు స్వర్గలోక వాసానికి యోగ్యత సంపాదించావు'. సింహం కూడా ఆ ధర్మ బుద్ధిగల గోవు యొక్క సంసర్గవల్ల పాపం నుండి విముక్తి పొందింది.

# సద్భావనలను పెంచి పోషించాలి

వైవస్వత మనువు సూర్య భగవానునికి అర్ఘ్యం ఇస్తున్నాడు. దోసిలితో నీళ్ళు తీసికున్నాడు. మంత్రాలు పఠిస్తున్నాడు. ఆయనకు దోసిలిలో ఏదో కదలిక తోచింది. కనులు తెరచి చూచాడు. తన దోసిలిలోని ఆ కొంచెం నీటిలో ఒక అతి చిన్న చేపపిల్ల ఈదులాడుతోంది. మనువు దానిని నీటిలో విసిరివేయబోయినాడు, ఇంతలో చేపపిల్ల ఇలా చెప్పింది, 'నన్ను రక్షించండి. పెద్దదాన్ని అయి నేను నీకు తోడ్పడతాను', కరుణాళువైన మనువు దాన్ని నీరు నింపిన పాత్రలో ఉంచాడు. చేపపిల్ల పెరుగసాగింది. మనువు దానిని పాత్రనుండి

ఒక బిందెలోకి, బిందెలో నుండి ఒక బావిలోకి , బావిలో నుండి ఒక సరస్సులోకి మారుస్తూ పోయాడు. ఆ చేప పెరిగి పెరిగి ఒక మహామత్స్యం అయిపోయింది. అప్పుడు దానిని మనువు సముద్రంలోకి వదలిపెట్టాడు. ఒకసారి మహా ప్రళయం వచ్చింది. సముద్రం భూమిని మ్రింగివేయసాగింది. అప్పుడు ఆ మహామత్స్యం మనువు దగ్గరకు వచ్చింది. ఆయనను ఒక నౌకలో కూర్చుండ బెట్టుకుని సురక్షితమైన స్థలానికి తీసుకువెళ్ళింది.

మన మనస్సు అనే దోసిటిలో కూడా సద్భావాలు అనే చేప పిల్లలు పుడుతుంటాయి. వాటిని మనం వదలివేస్తుంటాము. వానిని మనం పెంచి పోషించి పెద్ద చేస్తే అవి తరువాత తరువాత మనకూ ఇతరులకూ కూడా ఉపయోగపడతాయి.

# ఇటలీ వీరగాధ

ఫ్రాన్సుకు ఇటలీకి నడుమ యుద్ధం జరుగుతూంది. ఇటలీలోని నది వెడల్పు తక్కువే కాని, లోతు ఎక్కువ. గ్రామస్తులు దానిని దాటేందుకు ఖర్జూరపు చెట్టు వాసాలు రెండు వేసి ఉంచారు. ఫ్రాన్సు సైన్యం ఈ వంతెనను దాటి ఇటలీపై దాడి చెయ్యాలని సంకల్పించింది. గ్రామస్థులకు ఈ విషయం తెలిసింది. సైన్యం నదిని దాటకుండా చెయ్యాలి. అందుకు ఆ వాసాలను నదిలో పారవేద్దామని నిశ్చయించుకున్నారు. వారు గొడ్డళ్ళతో దాన్ని నరకసాగారు. ఫ్రాన్సు సైన్యానికి గ్రామస్థులు చేస్తున్న పని తెలిసింది. వారు వెంటనే వీరిపై కాల్పులు జరుపనారంభించారు. గ్రామస్థులు వీరులు, దేశభక్తులు, ధృఢసంకల్పం ఉన్నవారు. వారు ఆ వాసాలు నరికి వేస్తూనే ఉన్నారు. ఈ సందర్భంగా 300 మంది రైతులు మరణించారు. యువకులైన వారంతా

మరణించారు. ఒక వృద్ధుడు మిగిలివున్నాడు. అతను నది వద్దకు వెళ్ళి చూచాడు. ఆ వాసాలలో ఎక్కువ భాగం నరికివేయబడింది. ఇంకా కొద్దిగానే మిగిలి ఉంది. ఆ వృద్ధుడు పరిగెత్తుకుంటూ వచ్చాడు. ఎగిరి ఆచోట దూకాడు. వెంటనే ఆ వాసం విరిగినదిలో పడిపోయింది. వృద్ధుడు నదిలో కొట్టుకొనిపోయాడు. ఆ గ్రామంలో వయస్సు వచ్చిన పురుషులందరూ ఈ రకంగా తమ ప్రాణాలర్పించారు. సాహసాన్ని ప్రదర్శించారు. ఆవిధంగా ఫ్రాన్సు యొక్క ఆక్రమణను అడ్డుకోగలిగారు. స్వాతంత్ర్యం రక్షింపబడింది. ఇటలీకి చెందిన ఆ గ్రామస్థులు తమ దేశాన్ని రక్షించుకునేందుకై తమ సర్వస్వాన్ని సమర్పించారు. చరిత్రపుటలలో గౌరవమయమైన గాధను సువర్ణ అక్షరాలతో లిఖించుకున్నారు.

# ఘనత వహించిన భిక్షుకుడు

కాశీ హిందూ విశ్వవిద్యాలయ నిర్మాణార్థం చందాలు వసూలు చేసే కార్యక్రమంలో భాగంగా మహామనా మదన మోహన మాలవ్య హైదరాబాదు వెళ్ళారు. విశ్వవిద్యాలయ స్వరూపాన్ని ఆయన నిజాంకు వివరించి చెప్పారు. దానిని పూర్తి చేసేందుకు ఆర్థికంగా సహకరించవలసిందని అర్థించారు. తాను ఏమీ దానం ఇచ్చేది లేదని నిజాం నిష్కర్షగా చెప్పాడు. మాలవ్య లేచి వెళ్ళి రోడ్డుమీద నిల్చున్నారు. ఆ సమయంలో ఒక హిందూ సేఠ్‌జీ శవాన్ని తీసుకుని వెళుతున్నారు. శవంమీద పైసలు చల్లు తున్నారు. ఆ పైసలను పిల్లలు తదితరులు పరుగెత్తుకొని వెళ్ళి ఏరుకుంటున్నారు. మాలవ్యాకు ఏదో ఆలోచన వచ్చింది. ఆయనకూడా ఆ పైసలు ఏరుకోవటం మొదలుపెట్టారు. అందరూ ఆశ్చర్యంతో చూడసాగారు. ఒకరు సాహసించి ఆయనను అడిగారు, 'మహాశయా ఏమిటిమీరు చేస్తున్నపని?'

'హిందూ విశ్వవిద్యాలయ నిర్మాణానికై చందాలకొరకు నేను ఎక్కడికి వెళ్ళినా వారిదగ్గర నుండి ఖాళీ చేతులతో తిరిగి వెళ్ళరాదని ప్రతిజ్ఞ చేశాను. ఈ నిజాం నాకు ఏమీ ఇవ్వలేదు. నా ప్రతిజ్ఞ భంగం కాకుండా ఉండేందుకు ఇలా చేస్తున్నాను. ఇదన్నా కొంతనయం కదా' అని మాలవ్యా చెప్పారు.

ఈ విషయం నిజాంకు తెలిసింది. ఆయనకిది అవమానమనిపించింది. మాలవ్యాని వెనుకకు పిలిపించి విశ్వవిద్యాలయం కోసం దానం ఇచ్చాడు. దృఢ సంకల్పం కల మాలవ్యా అందుకే ఘనత వహించినట్టి భిక్షకుడుగా **(Rayal begger)** పేరుపొందాడు.

# సరియైన దృక్పథం

1970లో నాగపూర్‌లో రాష్ట్రీయ స్వయంసేవక సంఘ సమావేశం జరుగుతోంది. ప్రచారకులు, ప్రముఖ కార్యకర్తలు అందులో పాల్గొన్నారు. కార్యకర్తలు తమ నివేదికను ఇస్తున్నారు. ఒక కార్యకర్త తన క్షేత్రాన్ని గురించి సమాచారం ఇస్తున్నాడు. ఆ క్షేత్రంలో పని చాలా తక్కువగా ఉంది. శ్రీగురూజీ ఆ కార్యకర్తను అడిగారు, అక్కడ సంఘ కార్యం ఇలా ఎందుకుంది? పని పెరగక పోవటానికి కారణాలు ఏమిటి?

ప్రచారక్ జవాబిచ్చాడు. 'ఏమిచేయగలం ? అక్కడ సమాజం నిర్జీవంగా ఉంది. ఉత్సాహంగా లేదు.'

ఇది వినగానే గురూజీ గంభీరులైనారు ఒక్క నిమిషం మౌనం వహించి తరువాత కఠినంగా ఇలా అన్నారు, 'ఇక నీవు పని యేమిచేస్తావు? సమావేశంలో నిశ్శబ్దం తాండవిస్తోంది. కొంచెంసేపు ఊరకుండి శ్రీగురూజీ ఇలా వివరించారు, 'సమాజం పట్ల ఇలాంటి దృష్టి పెట్టుకొని పనిచేస్తే విజయం ఎలా లభిస్తుంది?

సమాజం పట్ల మనం ఎల్లప్పుడూ సరియైన దృక్పథం కలిగి ఉండాలి. సమాజంలోని దౌర్బల్యాలను తొలగించేందుకే కదా మనం కార్యక్షేత్రంలోకి పంపబడింది! సమాజం పట్ల మనకు సరియైన విశ్వాసం ఉండాలి. ఆరోగ్య వంతమైన దృష్టి వుంటే ఆరోగ్యవంతమైన సమాజం నిర్మించబడుతుంది. '

# జలియన్ వాలాబాగ్

1919 ఏప్రియల్ 13వ తేదిన అమృతసర్‌లోని జలియన్‌వాలాబాగ్‌లో గుమికూడిన ప్రజాసమూహముపై తెల్లప్రభుత్వ అధికారులు మరతుపాకులతో కాల్పులు జరిపారు. ఆ మరునాడు భగత్‌సింగ్ పాఠశాలకు ఉదయమే వెళ్ళాడు. భగత్‌సింగ్ చిన్న చెల్లెలు అమృత తన సోదరుని అప్పటి మనోదశను ఇలా వర్ణించి చెప్పింది. 'అతడు స్కూలుకు వెళ్ళనే లేదని తరువాత తెలిసింది. అతడు సరాసరి జలియన్‌వాలాబాగ్‌కు వెళ్ళాడు. ఇంటికి వచ్చేసరికి బాగా ఆలస్యం అయింది. ఇంట్లో అందరూ దిగులుపడి ఉన్నారు. ముఖం వ్రేలాడవేసుకొని ఎంతో సేపటికి ఇంటికి వచ్చాడు. అన్నా , ఇంత ఆలస్యం అయిందేమిటి? అని నేనడిగాను. జవాబు చెప్పాడు, ఏమితెచ్చానో చూడు. ఏమి తెచ్చావు? అని నేనడిగాను. అన్న జేబులో నుండి ఎర్రగా కనిపిస్తున్న ఒక సీసాను బయటకు తీసాడు. చూశావా ఇందులో జలియన్‌వాలాబాగ్‌లోని మట్టి ఉంది. నెత్తురుతో కూడినమట్టిఇది. తెల్లవాళ్ళు నిరాయుధులైన మన దేశీయులను హతమార్చారు. ఎంతమంది మరణించి ఉంటారో! అని అన్నాడు. అక్కడ ఏమిచూశాడో, ఏది విన్నాడో అది అంతా తడబడుతూ చెప్పాడు. ఆరోజున అన్న ఆహారం ముట్టలేదు. తోటలో నుండి చాలా పూలు తెచ్చి ఆ సీసాను అలంకరించాడు. దానికి ప్రణమిల్లాడు. లోపల ఏవేవో గొణుక్కున్నాడు. బహుశా మనస్సులోనే

ఒక నిశ్చయం చేసుకొని ఉంటాడు. చాలా రోజుల వరకు ఆ సీసాకు భక్తి కుసుమాలు సమర్పిస్తుండేవాడు.'

ఆహుతాత్ముల రక్తంతో ఆయనకు సన్నిహితమైన సంబంధం ఏర్పడింది. అందుకే అతడు తాను కూడా హుతాత్ముడైనాడు.

# మోక్షానికి మార్గం సేవ

భారతదేశంలో పర్యటిస్తూ స్వామి వివేకానందుడు దక్షిణదేశంలోని రామనాడ్ రాజ్యంలో మధురై వెళ్ళారు. ఈ నగరం ప్రస్తుతం తమిళనాడులో ఉంది. అక్కడ స్వామీజీకి రాజా భాస్కర సేతు పతితో పరిచయం అయింది. రాజు గొప్ప విద్వాంసుడు. స్వామీజీతో సంభాషించిన మీదట ఆయన ఎంతో ప్రభావితుడై స్వామీజీకి శిష్యుడైనాడు.

రాజా సేతుపతి ఒకనాడు స్వామీజీని ప్రశ్నించాడు, 'స్వామీజీ, మీరు విరాగులు. సంసారవిముఖులు. ఐనా దేశంలోని జనసామాన్యం యొక్క స్థితిని గురించి ఆలోచిస్తున్నారు. వ్యథ చెందుతున్నారు. వారి ఉన్నతికోసం విద్యా వ్యాప్తి జరగాలని వ్యవసాయ అభివృద్ధి చెందాలనీ ఉత్సాహంతో చర్చలు చేస్తున్నారు ఎందువల్ల?'

స్వామీజీ చెప్పారు, 'సన్యాసి ఐనవాడికి మోక్షమే లక్ష్యంగా ఉంటుంది. నిజమేకాని నా గురుదేవులు నన్ను ఆదేశించారు. భారతదేశ ప్రజల ఉన్నతికై ప్రయత్నించటం కూడా మోక్షప్రాప్తికి ఒక పవిత్రసాధనమే అవుతుంది' అని చెప్పారు. 'త్యాగము, సేవ అనేవి మన దేశంలో జాతీయగుణాలు'. రాజు ఇది విని సర్వజన హితచింతకుడైన ఆ సన్యాసికి శ్రద్ధాభక్తులతో నతమస్తకుడైనాడు.

# క్రోధాన్ని జయించే ఉపాయం

ఒకసారి శ్రీకృష్ణుడు, బలరాముడు, సాత్యకి అరణ్యంలో తిరుగుతూ దారి తప్పారు. రోజంతా అటు ఇటు తిరిగి వారు విసిగి వేసారిపోయారు. సాయంత్రం అయ్యేసరికి అరణ్యంలోవారు ఒక చెట్టు క్రింద ఆగిపోవలసి వచ్చింది. రాత్రికి అందరూ నిద్రపోవడం మంచిదికాదు. అందువల్ల ముగ్గురూ తమలో తాము ఒక నిర్ణయం చేసుకున్నారు. వంతులవారిగా ఒకరితర్వాత ఒకరు మేల్కొని వుండాలి.

మొదట శ్రీకృష్ణుడు, బలరాముడు నిద్రించారు. సాత్యకి కూర్చుని కాపలా వున్నాడు. కొంచెంసేపటికి అక్కడికి ఒక రాక్షసుడు వచ్చాడు. వాడు సాత్యకితో అన్నాడు 'నీ మేలు కోరి చెబుతున్నాను. ఈ ఇరువురిని నిశ్శబ్దంగా చంపితింటాను అంగీకరించు. లేదా నీ అంతు చూస్తాను' సాత్యకికి బాగా కోపం వచ్చింది. ఆ రాక్షసుడిని బెదిరిస్తూ సాత్యకి చెప్పాడు, 'పారిపో ఇక్కడి నుండి, లేదా నీ ఎముకలు విరిచి కుప్పపోస్తాను'.

రాక్షసుడు కూడా సాత్యకిని గట్టిగా బెదిరించాడు. ఇరువురి మధ్య మాట మాట పెరిగింది. వారు పరస్పరం కొట్లాడుకోవటం ఆరంభించారు. సాత్యకికి ఉన్న కొద్దీ క్రోధం పెరుగుతోంది. ఆయనకి కోపం పెరుగుతున్నకొద్దీ రాక్షసుడి బలం కూడా పెరుగుతోంది. రాక్షసుడు సాత్యకిని క్రిందపడవేసి కొట్టాడు. సాత్యకికి ఒళ్ళు హూనం అయింది. ఇప్పుడు బలరాముడు లేచే సమయం అయింది. రాక్షసుడు చల్లగా జారుకున్నాడు. బలరాముడు లేచి కూర్చొని పహరా ఇస్తున్నాడు. రాక్షసుడు మళ్ళీ వచ్చాడు. వాడు బలరాముడితో అదే మాట చెప్పాడు. మిగిలిన ఇరువురిని తాను చంపి తింటానన్నాడు. అందుకు అంగీకరించమన్నాడు. లేకపోతే బలరాముడిని వదలిపెట్టను అన్నాడు.

బలరాముడికి కూడా కోపం వచ్చింది. ఇద్దరు యుద్ధం చేశారు బలరాముడికి క్రోధం పెరుగుతున్న కొద్దీ రాక్షసుడి బలం ఎక్కువకాసాగింది. బలరాముడు కూడ రాక్షసుడిని ఏమీ చేయలేకపోయాడు. బలరాముడి తర్వాత కృష్ణుని వంతు వచ్చింది. రాక్షసుడు కృష్ణుడికి కూడా అదే మాట చెప్పాడు. కృష్ణుడికి కోపం రాలేదు. ఆయన నవ్వాడు. దీనితో రాక్షసుడికి కోపం వచ్చింది. వాడు కృష్ణునిమీదకు ఉరికాడు. కృష్ణుడు నిల్చుని తప్పించుకున్నాడు. రాక్షసుడు కోపంతో ముందుకు దూకినప్పుడల్లా కృష్ణుడు తప్పించుకునేవాడు. తరువాత నవ్వి, 'సోదరా! వహ్వా, నువ్వు నిజంగా గొప్ప వీరుడివి. కాస్తలో తప్పిపోయింది' అంటున్నాడు దీనితో రాక్షసుడి బలం క్షీణించసాగింది. కొంచెం సేపటికి రాక్షసుడు బలహీనుడైపోయాడు. కృష్ణుడు తనని అప్పుడు సులభంగా పట్టుకొని చెట్టుకి కట్టివేశాడు.

ఉదయమే బలరాముడు , సాత్యకి, మూలుగుతూ నిద్రలేచారు. వారిద్దరికీ శరీరమంతా నొప్పులు. కృష్ణుడు ఉత్సాహంగా, సంతోషంగా వున్నాడు. వారిరువురికీ ఆశ్చర్యం కలిగింది. ఇరువురూ వ్యాకుల పడుతున్నారు. కృష్ణుడు కారణం అడిగాడు. వారు జరిగిన సంగతి చెప్పారు. అంతావిని కృష్ణుడు కొంచెందూరంలో చెట్టుకు కట్టబడి వున్న రాక్షసుడిని చూపించి ఇలా అన్నాడు, 'చూడండి, మీ దుస్థితికి కారణం వాడు కాదు కదా?' ఇద్దరూ వాడిని చూసి అదిరిపడ్డారు. 'అవును, అవును, వీడే ఆ దుష్ట రాక్షసుడు. రాత్రి వచ్చినవాడు వీడే. కాని ఇంతటి బలవంతుడిని నీవు ఒక్కడివే ఎలా బంధించావు?' శ్రీకృష్ణుడు చెప్పాడు, 'వీడు క్రోధ రాక్షసుడు. మీకు క్రోధం ఎక్కువ అవుతుంటే వాడి బలం ఎక్కువ అవుతూ వుంటుంది. క్రోధం ప్రదర్శిస్తే ఆ క్రోధం ఇంకా పెరుగుతుంది. ఇందులో ఆశ్చర్యం ఏముంది? నేను క్రోధం

ప్రదర్శించలేదు మాటిమాటికీ నవ్వుతూ వాడి దెబ్బనుండి తప్పించుకున్నాను. తత్ఫలితంగా వాడి బలం తగ్గిపోయింది. వాడు నన్ను ఏమీ చేయలేకపోయాడు. క్రోధాన్ని జయించే మార్గం ఇదే.'

# మార్గ దర్శకుడైన నాయకుడు

మహాత్మాగాంధీ ఆ రోజులలో చంపారన్ (బీహార్) లో ఉన్నారు. ఒక రాత్రి ఆయన అక్కడి నుండి బేతియా వెడుతున్నారు. రైలు ఖాళీగా ఉన్నది. మహాత్ముడు మూడవ తరగతి పెట్టెలో ఒక సీటు మీద నిద్రపోతున్నాడు. అర్థరాత్రి సమయానికి రైలు ఒక స్టేషన్‌లో ఆగింది. ఒక రైతు ఆ పెట్టెలోకి ఎక్కాడు. అతడు మహాత్ముణ్ణి తట్టిలేపి అన్నాడు, 'లేలే ఈ బండి నీ స్వంతం అయినట్లుగా పడి నిద్రపోతున్నావు' గాంధీజీ లేచి కూర్చున్నాడు. ఆ రైతు కూర్చొని పాటపాడసాగాడు -

ధన్యుడు, ధన్యుడు గాంధీజీ పేదల పాలిట పెన్నిధి

ధన్యుడు ధన్యుడు గాంధీజీ నది దాటించే వారధి

నిజానికి ఆ రైతు గాంధీజీ దర్శనం కోసం బేతియా వెళుతున్నాడు. తాను తట్టి లేపిన వ్యక్తి, తన పాటవిని చిరునవ్వు నవ్వుతున్న వ్యక్తి గాంధీజీయేనని పాపం అతనికి ఏం తెలుసు? బేతియాలో రైలు ఆగింది. వేలాదిగా ప్రజలు వచ్చారు. గాంధీజీకి జైజైకారాలు పల్కుతున్నారు. అప్పుడు ఆ రైతుకి తాను చేసిన పొరపాటు ఏమిటో తెలిసింది. అతడు కన్నీరు కార్చుతూ గాంధీజీ పాదాల మీద పడ్డారు. గాంధీజీ అతన్ని లేవనెత్తి కౌగిలించుకున్నాడు.

# కర్తవ్యనిష్ఠుడైన ఉపాధ్యాయుడు

గంగాధరశాస్త్రి ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన విద్వాంసుడు. ఢుండిరాజు ఆయన కుమారుడు. ఢుండిరాజ తోటి విద్యార్థులకు ఎంతో ఆప్తుడుగా వుండేవాడు. గంగాధర శాస్త్రి ఒక అధ్యాపకుడు. ఒక రోజున అకస్మాత్తుగా జబ్బుచేసి ఢుంఢిరాజు మరణించాడు.

పండిత గంగాధరశాస్త్రి ఎప్పటి మాదిరిగానే ఆ రోజు కూడా పాఠం చెప్పాడు. అయితే ఆయన ముఖం ఎంతో ఉదాసీనంగా, గంభీరంగా వుంది. పాఠం అయిన తర్వాత తోటి విద్యార్థులు వెళ్ళి ఢుండిరాజును కేకవేసి పిలిచారు. అప్పుడు పండిత గంగాధర శాస్త్రి చెప్పాడు, వాడు చాలా దూరం వెళ్ళిపోయాడు. మీ కేక అక్కడి దాకా వినిపించదు, మొదట విద్యార్థులకి అర్థంకాలేదు. తర్వాత మరణవార్త తెలిసింది. విద్యార్థులకు ఆశ్చర్యంవేసింది. వినయంగా అడిగారు, 'గురూజీ ఇంత శోకంలో కూడా మీరు పాఠం చెప్పటం ఆపలేదు!'

'ఎలా ఆపగలను నాయనా!' పండితుడు ఆగి ఆగి స్పష్టమైన స్వరంతో చెప్పాడు. 'మీరంతా పిల్లలు. ఎక్కడెక్కడి నుంచో వచ్చారు. ఒక్కరోజు మాత్రం ఎట్లా వ్యర్థం చేస్తాను? పుత్రశోకం నా సొంత విషయం. కాని జ్ఞాన సమారాధన అందరికీ సంబంధించిన విషయం. దాన్ని ఆటంక పరచి మీ అభివృద్ధిని కుంటుపర్చటం నాకు న్యాయమా?'

అచంచలమైన ఈ కర్తవ్యనిష్ఠచూచి అంతా నిశ్చేష్టులైనారు. ఆ విద్యార్థులలో కంటతడి పెట్టనివారులేరు.

# వీరపత్ని జీజాబాయి

శివాజీ తల్లి జీజాబాయి మహారాష్ట్ర ప్రాంతంలో సింద్‌ఖేడ్ అనే గ్రామంలో పుట్టింది. మరాతా సర్దార్ లఖూజీ జాధవరావు కుమార్తె ఆమె. నిజాంషాహిలో లఖూజీ జాధవరావు సర్దార్ పదవిలోవున్నాడు. అలా పదవి పొందిన సేనానులలో అతడు ప్రధముడు. మాలోజీ పుత్రుడు షహాజితో జీజాబాయి వివాహం అయింది.

షహాజీకి, జాధవరావుకు వైరం వుండేది. జాధవరావు మొగలుల వైపున వున్నాడు. షహాజీ మరాతాల వైపున వున్నాడు. జీజాబాయి మొగలులకు బందీ అయింది. ఆమె తన తండ్రి ఆధీనంలో వుంది. జీజాబాయి అప్పుడు గర్భవతి. జాధవరావు కుమార్తె పరిస్థితి చూచి ఇలా చెప్పాడు, 'అమ్మా నీకీ కష్టమెందుకు? సిందఖేడ్‌లో మన ఇంటికి వెళదాం పద. నేను ఇప్పుడే పల్లకీ ఏర్పాటు చేస్తాను.'

జీజాబాయి వీరపత్ని. ఆమె దీనికి ఎలా అంగీకరిస్తుంది? తన తండ్రితో నిర్భయంగా ఇలా చెప్పింది. 'మీరు భోంస్లే కుటుంబం మీద పగ తీర్చుకోవాలని అనుకుంటున్నారు. ఇక్కడ నేను మీ ముందున్నాను. నా మీద తీర్చుకోండి పగ. నాకు వివాహం అయింది. భోంస్లే కుటుంబంతో నాకు సంబంధం ఏర్పడింది. ఆనాడే నాకు మీ కుటుంబంతో సంబంధం తెగిపోయింది. నేను వీరభోంస్లేల ఇంటి కోడలిని. నా భర్త ఇంటి రొట్టెముక్క లభించవచ్చుగాక. కాని అది మీ ఇంట లభించే పంచభక్ష్య పరవాన్నములకంటే, రత్నహారాలకంటే నాకు ఎక్కువ ప్రియమైనది. నేను మీ ఇంటికి రాను' జీజాబాయి ఇలా హూంకరిస్తూ దుర్గాదేవిని తలపించింది. జాధవరావు ఇక అక్కడ ఉండకుండా వెళ్ళిపోయాడు.

# వీరుల పట్ల శ్రద్ధ

ప్రిన్స్ ఆఫ్ వేల్స్ ఎడ్వర్డ్ (ఎనిమిది) ఒక రోజున ప్రపంచ యుద్ధంలో గాయపడిన సైనికులను చూడటానికి వెళ్ళాడు. ఇంగ్లాండులోని ఒక ప్రయివేట్ ఆసుపత్రిలో 36 మంది గాయపడిన సైనికులు పడి ఉన్నారు. అధికారులు ప్రిన్స్‌ను ఆసుపత్రికి తీసుకుని వెళ్ళారు. అంతాచూచిన తర్వాత ప్రిన్స్ ద్వారం దగ్గరకు వచ్చాడు. 'మీరు 36 మంది గాయపడ్డారని చెప్పారు నేను 29 మందిని మాత్రమే చూచాను' అని అన్నాడు.

మిగతావారు తీవ్రంగా గాయపడ్డారు. అందువల్లవారిని నీ ముందుకు తీసుకుని రాలేదు.

వారిని చూచి రావాలి, అని ప్రిన్స్ పట్టుపట్టాడు. వారిలో ప్రతి ఒకరి బెడ్ వద్దకు వెళ్ళి ఆప్యాయంగా పలుకరించి ఉత్సాహపరచాడు. అధికారులు తనను బయటకు తీసుకుని పోతుండగా ప్రిన్స్ మళ్ళీ అడిగాడు, 'ఏడవసైనికుడు ఎక్కడ? ఇక్కడ ఆరుగురే కదా ఉన్నారు!'

అధికారులు సందేహిస్తూ చెప్పారు, 'అతనిని చూసి ఏం చేయగలం? అతని పరిస్థితి ఇంకా ఎక్కువ ప్రమాదకరంగా వుంది. ఆ దృశ్యం భయంకరమైనది. మీరు చూచి భరించలేరు.'

'లేదు, నేను అతనిని తప్పక చూడాలి. ప్రిన్స్ చెప్పాడు. అధికారులు మరల తప్పించుకోవాలని చూచారు. వారిలా అన్నారు, అతడు చూడలేడు, తినలేడు. అతనివద్దకు వెళ్ళి ఏమిచేస్తారు?' కాని ప్రిన్సు పట్టు విడవలేదు. తప్పించుకోలేక వారు ఆయనను అక్కడికి తీసుకుని వెళ్ళారు. అక్కడ ఒక మాంసపు ముద్ద కనపడింది. తన జీవితాన్ని యుద్ధరంగంలో పణం పెట్టి పోరాడిన వీరుని దేహం

అది. చీకటిగదిలో పడి ఉన్న ఆ శవాన్ని ప్రిన్స్ పరిశీలించి చూచాడు. ఎంతో ఆత్మీయతతో, శ్రద్ధాభావనతో ఆ వీరుని చేతిని ముద్దుపెట్టుకున్నాడు. ఎంత పవిత్రమైనది ఆ ముద్దు!

# భక్త శిఖామణి రామానుజాచార్యుడు

ఒకసారి కాంచీపూర్ణులు కేశవాచార్యుల ఇంటికి వెళ్ళారు. రామానుజాచార్యులు శ్రీకేశవాచార్యుల కుమారుడు. తండ్రి రామానుజాచార్యులతో ఇలా అన్నాడు, 'కుమారా, శ్రీ కాంచీ పూర్ణులు సాక్షాత్తుగా వరద రాజస్వామియే. వారిని సేవించి తరించు'. శ్రీ కాశీపూర్ణులు శయనించేముందు గదిలోకి శ్రీరామానుజాచార్యులు వెళ్ళారు. ఆసనం వద్దకు వెళ్ళి ఆ మహాభక్తుని పాదాలను తన ఒడిలో తీసుకున్నాడు. శ్రీకాంచీపూర్ణులు ఉలిక్కిపడిలేచారు. 'ఇదేమి పని నాయనా, నీవు బ్రాహ్మణుడవు ' 'నేను శూద్రుడను' ,రామానుజుడు చెప్పాడు 'హే భక్తశిరోమణీ, కులానికీ , భక్తికీ సంబంధంలేదు. ఎవరయినా తన కర్మ కారణంగా మహాత్ముడవుతాడు. జన్మచేత కాదు. మీరు మహాపురుషులు. మీ సేవ చేయడం నా మహాభాగ్యం'. శ్రీకాంచీ పూర్ణులు పరవశులై పోయినారు. 'ప్రభూ, నీ ఇచ్ఛ' అని చెప్ప శయనించారు. రామానుజుడు శ్రద్ధాభక్తులతో వారి పాదాలను ఒత్తుతూ కూర్చున్నాడు. ఉదయమే లేచి శ్రీకాంచీపూర్ణుడు రామానుజులకు 'ఓం నమో నారాయణాయ' అని అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశించారు. ఈ మంత్రాన్ని ఇతరులెవ్వరికీ ఉపదేశించరాదని శ్రీరామానుజుల చేత ప్రమాణం చేయించుకున్నారు. కొంత కాలం తర్వాత రామానుజుల హృదయంలో ఒక

పవిత్రమైన కోరిక చిగురించింది. అందరికీ శ్రేయస్సును చేకూర్చాలి అనే భావన కలిగింది. దేవాలయ శిఖరంపైకి ఎక్కి రామానుజుడు ఆ మంత్రాన్ని పెద్దగా ఉచ్చరించడం మొదలుపెట్టాడు. చూస్తుండగానే అన్ని వర్గాల ప్రజలు అక్కడ గుమిగూడారు. అందరూ కలిసి, 'ఓం నమో నారాయణాయ', మంత్రాన్ని ఉచ్చరించారు. అనుకోకుండా కాంచీపూర్ణులు కూడా అక్కడికి వచ్చారు. 'రామానుజా, ఇది ఏమిటి? నీ ప్రతిజ్ఞను భంగం చేశావు. ఇది అపరాధం. నీవు నరకానికి వెళ్తావు. దుఃఖం అనుభవిస్తావు' అని అన్నారు. రామానుజుడు తొణకలేదు. ప్రశాంత భావంతో చెప్పాడు 'మహాత్మా, ఈ మంత్రాన్ని సామూహికంగా ఉచ్చరించడం వల్ల అసంఖ్యాకులైన జీవులు భగవద్భక్తులయినారు. భవసాగరాన్ని దాటారు. అందుకునేను కోట్లాది నరకాలలో కష్టాలు అనుభవించేందుకు సిద్ధంగా ఉన్నాను.

కాంచీపూర్ణులు మౌనంగా ఉండిపోయారు. ఆయన నేత్రాలు ప్రకాశించాయి. ఆయన నోటి నుండి ఈ మాటలు వినపడ్డాయి, వత్సా, నీకు మేలు జరుగుతుంది. నీకు నా ఆశీస్సులున్నాయి.

# మాట తప్పని కర్మయోగి

పండిత పద్మనాభ విద్యా వినోదులు గౌహతిలోని కాటన్ కాలేజీలో సంస్కృత ఉపన్యాసకులుగా ఉన్నారు. ఆయన గొప్ప విద్వాంసులు. ప్రాచీన గ్రంథాలను, రాగిరేకులను అధ్యయనం చేసే పరంపరను అస్సాం ప్రాంతంలో ప్రప్రథమం ప్రవేశపెట్టింది ఆయనే. ఆయన అనేక రిసెర్చి గ్రంథాలను రచించారు. వృద్ధాప్యంలో వారు కాశీలో నివసిస్తూ ఉండేవారు. 1925-26 ప్రాంతంలో ఈ సంఘటన జరిగింది. శ్రీరాధానాథ ఫూకన్ అస్సామీ భాషలో

సుప్రసిద్ధ సాహిత్యవేత్త ఏదో పనిమీద ఆయన వారణాసి వెళ్ళారు. అక్కడ బ్యాంకులో చెక్కుకు డబ్బుతీసుకోవలసి వచ్చింది. అందుకై ఒక సాక్షి కావాలసి వచ్చింది. వారు శ్రీ విద్యా వినోదుల దగ్గరకు వెళ్ళారు. శ్రీరాధానాథులకు సహాయపడేందుకు ఆయన సంతోషంగా అంగీకరించారు. మర్నాడు 11 గంటలకు బ్యాంకు దగ్గరకు వస్తానని మాట ఇచ్చారు.

మర్నాడు 12 గం.ల వరకు ఎదురుచూచినా పద్మనాధులు బ్యాంకుకు రానేలేదు. శ్రీపూకన్ అనుకున్నారు, వృద్ధాప్యం కారణంగా బహుశా వారు మర్చిపోయి వుండవచ్చు. వారు తిరిగి వెళ్ళడానికి బయలుదేరారు. అప్పుడే ఎదురుగా శ్రీవిద్యావినోదులు కనిపించారు. భుజం మీద అంగ వస్త్రం ఉంది. వేగంగా అడుగులు వేసుకుంటూ వస్తున్నారాయన. దగ్గరకు రాగానే ఆయన ఆలస్యానికి క్షమించమని వేడుకున్నారు. తర్వాత దానికి కారణం ఇలా చెప్పారు, 'ఆలస్యంగా రావడం వల్ల మీకు ఇబ్బంది కల్గించాను. ఇవాళ ఉదయమే నా భార్య మరణించింది. దహన సంస్కారాదులు పూర్తిచేసి సరాసరి అక్కడనుండి ఇక్కడికే వస్తున్నాను. పదండి, మీ పని పూర్తి చేద్దాం.'

పండిత పద్మనాభ విద్యా వినోదులు కర్మయోగి. మాట తప్పని మనీషి. ఆయన ధన్యుడు.

# ఓటమి నేర్పిన పాఠం

స్కూలులో కథల పోటీ పెట్టారు? ఒకనెల వ్యవధి ఇచ్చారు. బాలుడైన ఎర్నెస్ట్ హెమింగ్వేకు ఆశ్చర్యంగా ఉంది. ఒక కథ వ్రాయడానికి ఒక నెల సమయం ఎందుకు? అందువల్ల నిర్ణీత సమయానికి పూర్వం ఒకటి, రెండు రోజులలో త్వరత్వరగా ఒక కథ వ్రాయడం పూర్తి చేసి హెమింగ్వే ఇచ్చేశాడు. ఫలితాన్ని

గురించి ఆయనకు పూర్తి విశ్వాసం ఉంది. ఆరోజున బడికి వెళ్ళాడు.

కాని, తానాశించి దానికి విరుద్ధంగా ఫలితం వచ్చింది. ఇంకో విద్యార్థికి బహుమతి వచ్చింది. ప్రతిభాసంపన్నుడైన హెమింగ్వేకు మనస్సు దెబ్బతిన్నది. నిరాశ వల్ల, అపజయం వల్ల కన్నీళ్ళు వచ్చాయి. అతని సోదరి అతనిని సముదాయించింది, నీవు ప్రతి పని ఆఖరి క్షణాల్లో చేస్తావు. ఈ అలవాటు కారణంగా నీకు అపజయం ఎదురవుతున్నది. ఈ పరాజయాన్ని విజయానికి ఒక మెట్టుగా భావించు. ప్రతి పనిని నియమ పూర్వకంగా పూర్తి చేసే అలవాటు చేసుకో. సోదరి చెప్పిన పాఠం పని చేసింది. దానినే హెమింగ్వే తనకు ఆదర్శంగా పెట్టుకున్నాడు. చివరికి సాహిత్యంలో కీర్తిగాంచి శిఖర స్థాయికి చేరుకున్నాడు. నోబుల్ బహుమతిని పొందాడు.

# దేశభక్త శిరోమణి - రాజు

రాత్రి సమయం. ఇంటిలో దీపం వెలుగుతోంది. ఆ గ్రుడ్డి వెలుతురిలో 7-8 ఏండ్ల బాలుడు గదిలో కూర్చున్నాడు. ఎదురుగా చదువుకునే పుస్తకం ఉంది - ప్రక్కనే తల్లి కూర్చుని ఉంది. అతనిని చదివిస్తోంది. తల్లి ఒక ప్రశ్న అడిగింది 'నాన్నా, విను ఒక వ్యాపారి రూపాయికి ఒకటి చొప్పున 12 మందు సీసాలు కొన్నాడు. 3 రూపాయలకు ఒక మందుసీసా వంతున అమ్మితే ఎంత లాభం వస్తుంది?'

ఒక నిమిషం ఆలోచించి ఆ పిల్లవాడు అడిగాడు, 'అమ్మా, అది ఏమి మందు? అరే దానితో నీకేమి పని. సూటిగా జవాబు చెప్పు.'

'జవాబు అందులోనే ఉందమ్మా. ఆ మందు పేరేమిటో చెప్పు.'

'ఏదో ప్రాణాలు రక్షించే మందు అనుకో.'

బాలుడు వెంటనే సమాధానం చెప్పాడు, 'ఆ వ్యాపారస్థునికి 12 కొరడా దెబ్బలు శిక్షగా వెయ్యాలి.'

తల్లి నిశ్చేష్టురాలై చూసింది.

'ఇదా దానికి జవాబు?'

'అవునమ్మా, ప్రాణాలు కాపాడే మందును ఆ వ్యాపారస్థుడు ఎక్కువ లాభానికి అమ్మితే పేదవారు దానిని ఎలా కొనుక్కోగలరు? లోభియైన ఆ వ్యాపారస్తుడికి 12 కొరడా దెబ్బలు తగలవలసిందే.'

ఈ అద్భుతమైన జవాబు చెప్పిన బాలుడిని ఇంట్లో రాజు అని పిలుస్తారు. అతని పూర్తిపేరు అల్లూరి సీతారామరాజు. ఆంధ్రప్రదేశ్‌లో మోగల్లు అనే గ్రామంలో 4 జూలై 1897 న అతడు జన్మించాడు. పెద్దవాడయిన పిదప అల్లూరి సీతారామరాజు గొప్ప స్వాతంత్ర్య సమయ యోధుడుగా ప్రసిద్ధికెక్కాడు. సీతారామరాజు బలిదానాన్ని గురించి జవహర్ లాల్ నెహ్రూ ఇలా చెప్పాడు, 'రాజు దేశభక్తులలో ముకుటమణి. రాజువంటి దేశభక్తుల బలిదానం కారణంగానే మన మాతృభూమి అయిన భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది.'

# తండ్రి నేర్పిన పాఠం

ఒక ఆంగ్లేయ సైనికుడు గుర్రం మీద స్వారీ చేస్తూ వెళ్తున్నాడు. త్రోవలో సైనికుడి కుచ్చు టోపీ చూచి బాలురు కొందరు సలామ్ సలామ్ అంటూ అరవసాగారు. రాజుకు కూడా ఉత్సాహం కలిగింది. అతడు కూడా సలామ్ అనేశాడు. ఆంధ్రప్రదేశ్‌లోని మోగల్లు అనే ప్రాంతంలో నివసించే వెంకట్రామరాజు రాజుకు తండ్రిగారు. ఆయన ఆ సమయంలో రాజు వెంట ఉన్నాడు. ఒక ఆంగ్లేయ సైనికుడికి రాజు సలామ్ చేయడం చూసేసరికి ఆయన కళ్ళు క్రోధంతో ఎర్రబడ్డాయి. రాజు చెంపమీద ఆయన పటపట రెండు దెబ్బలు

వేశాడు. క్రోధ స్వరంతో ఆ తండ్రి ఇలా చెప్పాడు, 'మూర్ఖుడా, ఒక విదేశీయుడిముందు నీ తల వంచడానికి సిగ్గులేదా? నీ వంశం ఏమిటి? సంస్కృతి ఏమిటి! జాగ్రత్త , మళ్ళీ ఎప్పుడన్నా ఇలాంటి పని చేశావంటే ప్రాణాలుతీస్తాను'. ఏడుస్తూ రాజు చెప్పాడు, 'లేదు తండ్రీ మళ్ళీ ఎప్పుడూ ఇలాంటి పని చేయను'. రాజు తన తండ్రికిచ్చిన మాటను ఆజన్మాంతం పాటించాడు. ఆంగ్లేయులను దేశం నుండి పారద్రోలేందుకై చివరిక్షణం వరకు ఆయన పోరాడుతూనే ఉన్నాడు. బ్రిటీష్ మేజర్ గుడాల్ తుపాకీ గుళ్ళకు గురి అయి తన మాతృభూమి ఒడిలో శాశ్వతంగా నిద్రపోయాడు. ఆయన బలిదానాన్ని గురించి మహాత్మాగాంధీ ఇలా అన్నారు, 'రామరాజు ధైర్య సాహసాలు సర్వదా మనకు ఆదర్శప్రాయమైనవి'.

# సతీసహగమన నిరోధం

సాయంకాల సమయం. సూర్యుడు పడమటి కనుమలలోకి వేగంగా వెడుతున్నాడు. అది వసంతఋతువు. బెంగాల్ ప్రాంతంలోని రాధా నగర గ్రామానికి కొంచెందూరంగా ఉన్న స్మశాన భూమిలో ఒక విచిత్ర దృశ్యం కనపడింది. రాజా రాధా కాంతరాయ్ కుమారుడు జగమోహన్ స్వర్గస్థుడయినాడు. గ్రామమంతా దుఃఖంలో మునిగి ఉంది. మృత్యుదేవత ప్రత్యక్షంగా నాట్యమాడుతున్నదా అన్నట్లుగా ఉన్నది. దూర దూర గ్రామాల నుండి వేలాదిగా జనులు ఆ సత్పురుషునికి శ్రద్ధాంజలి ఘటించే నిమిత్తం వచ్చారు. సర్రుమని గాలి వీసు ్తన్నది. చితిపైన కట్టెలు పేర్చారు. జగ్‌మోహన్‌రాయ్ శవాన్ని చితిపై ఉంచారు. జన సమూహమంతా రోదించసాగారు. మృతుని భార్య ఆలోకమంజరి పరిస్థితి హృదయవిదారకంగా ఉంది. ఆమె కన్నుల ఎదుట అంతా చీకటి. పెద్దగా ఏడుస్తూ ఆమె తన పతి శవం

మీదపడిపోయింది. విడినకేశాలు, కన్నులలో ఘోర నిరాశ, కాంతి విహీనమైన శరీరం - ఇది ఆమె స్థితి. పాపటలోని సింధూరం ఈనాడు చిట్ట చివరిసారిగా కాంతులు విరజిమ్ముతోంది. ఆమె నాలుకపై ఒకే వాక్యం 'హే అగ్ని దేవా, నన్ను కూడా నా పతిదేవునితో పాటు నీలో చేర్చుకో'.

ఆనాడు మన దేశంలో ముఖ్యంగా బెంగాల్ ప్రాంతంలో భర్త మరణిస్తే భార్య కూడా ఆ భర్తతో పాటు మరణించడం ధర్మంగా భావించబడేది. దురదృష్టవశాత్తు అది రానురాను సమాజంలో బలవంతంగా జరిగే పనిగా మారిపోయింది. వైధవ్య జీవనం భరింపరానిదిగా ఉండేది. విధవరాండ్రను సమాజం ఉపేక్షించేది, పీడించేది.

ఈ కారణంగా మహిళలు అప్పుడప్పుడూ సమాజ భయం వలన ఇష్టంలేకపోయినా ఈ పని చేయాల్సి వచ్చేది. మృత్యుభయం వల్ల వాళ్లు చితినుండి బయటకు వస్తారేమో అని వారిని అప్పుడప్పుడు కట్టిపడేస్తుండేవాళ్ళు. ఆ సమయంలో ఆ స్త్రీ ఆర్తనాదాలు, శంఖధ్వనులు ఘంటానాదాలలో కలసిపోయేవి.

ఆ రోజున మృతుని దహన సంస్కారాల నిమిత్తం పురోహితుడు మంత్రోచ్చారణ గావించాడు. అగ్ని ముట్టించబడింది. చందనం కట్టెలు చిటపట మని మండసాగాయి. ఆలోకమంజరి మరలా అగ్ని ఎదుట నిలుచొని ఇలా ప్రార్థించింది, పరలోకానికి కూడా పతిని అనుసరించే స్త్రీ సతి అనిపించుకుంటుంది. జనులు కేకలు వేస్తున్నారు, ధన్యురాలు, ధన్యురాలు పురోహితుల వారు చెప్పారు, పతితో సహమరణం శాస్త్ర సమ్మతం. ఇది మన పూర్వీకులు పెట్టిన ఆచారం. విధవరాలికి ఇదే గౌరవనీయమైన ఏకైక మార్గం. ఆలోక మంజరిని జనులు చితి దగ్గరకు తీసుకుని వెళ్తున్నారు. ఆమెకు

హఠాత్తుగా ఏదో చెప్పరాని భయం ఆవహించినట్లుంది. ఆమె నోటి నుండి భయంకరమైన ఆర్తనాదం వెలువడింది. ఆమె భయాన్ని, ఆమె దురవస్థను చూచి మృతుడైన జగమోహన్ చిన్న తమ్ముడు కంపించిపోయాడు. ఆ బాలుడు వేగంగా గుంపును చీల్చుకుంటూ ముందుకు వచ్చి పెద్దగా అరిచాడు, 'ఆగు! ఆగు! వదినా! నిన్ను నిప్పులలో దూకి చావనివ్వను'.

అతడు చేయి పైకెత్తి పురోహితున్ని ఆగమన్నాడు. జనులు క్రోధ పరవశులు అయినారు. ఒక బంధువన్నాడు, 'వీడు మ్లేచ్ఛుడు, ధర్మాన్ని గురించి తెలియనివాడు. వీడిని కులం నుండి వెలివేయండి.'

'నా సోదరుణ్ణి ప్రశాంతంగా స్వర్గానికి వెళ్ళనివ్వండి. మృతులైన వారు జీవించి ఉన్న వారిని తమ వెంట తీసుకొని వెళ్లేందుకు ఇష్టపడరు'. అని బాలుడు చెప్తూపోతూ ఉన్నాడు.

'బాబూ, నన్ను వారితోపాటు వెళ్ళనీ. నేనెవరికోసం జీవించాలి? వీళ్ళందరూ నన్ను పతితురాలిగా, పాపినిగా చూస్తారు. శాస్త్ర విరుద్ధంగా చేస్తే భగవంతుడు కూడా దండిస్తాడు'. హతాశ అయిన ఆ స్త్రీ చెప్పింది. 'వదలండి ఆమెను' బాలుడు ఆవేశ పూరితుడై చెప్పాడు. ఇది ఘోర అత్యాచారం. బతికున్నవాళ్ళు అగ్నిలో పడి మరణించడమే వారి శ్రద్ధాభక్తులకు నిదర్శనం అయినట్లయితే తండ్రి మరణించినప్పుడు కుమారుడు, భార్యమరణించినప్పుడు భర్త ఎందుకు అగ్నిలో దూకటంలేదు? ఈ విధానం స్త్రీలకే ఎందుకు?

కాని ఆ బాలుని విశుద్ధ తర్కం జన సమూహపు కేకలతో అణగిపోయింది. ఎవరివో ధృడమైన చేతులు బాలుణ్ణి బంధించాయి.

ఆలోకమంజరి తడబడుతూ, చితిపైకెక్కింది. ఆమెను దానికి కట్టివేశారు. అగ్ని జ్వాలలు మిన్నుముట్టాయి. ఆలోకమంజరి ఆర్తనాదం చేసింది.

బాలుడు పెనుగులాడుతూ లేచాడు గొంతు చించుకొని అరిచాడు, వదలండి మా వదినగారిని - వదలండి. ఓ నరపిశాచాల్లారా, ఈ అత్యాచారాన్ని మానండి. భయంకరమైన ఆ దృశ్యాన్ని చూచి అతడి నేత్రాలు బ్రద్దలయినాయా అనిపించింది.

శంఖధ్వానాలు, జేగంటలు మ్రోతలు ప్రతిధ్వనించాయి. జయ జయకారాలు మిన్నంటాయి. ఈ కోలాహలంలో ఆకలోకమంజరి కేకలు, పెడబొబ్బలు అణగిపోయాయి. కొద్ది క్షణాల్లో అంతా అయిపోయింది. శాంతి ఆవరించింది. కట్టెలు చిటపటలాడుతున్నాయి. గుంపు చెదిరిపోయింది. రాథానగర్‌లోని రాజమహల్‌లో స్తంభానికి బంధింపబడిన ఆ బాలుడు చేతులు పై కెత్తి ప్రతిజ్ఞ చేస్తున్నాడు, దేశంలో సతీసహగమనం పేరిట సాగే ఈ ఘోర దురాచారాన్ని రూపుమాపే వరకు నేనే స్వేచ్ఛగా గాలిపీల్చుకోను.

రాధానగర్‌లోని ఆ రాజమహల్ శిధిలాలలో ఆ స్తంభం ఇప్పటికీ నిల్చి ఉంది. అది ఆ అధునిక భీష్మపితామహుణ్ణి కీర్తిస్తోంది. ఆయన్ని ఇంటినుండి తరిమివేశారు. కులం నుండి బహిష్కరించారు. పురోహితులు అవమానించారు. కాని ఆ దివ్యపురుషుడు ఉద్యమించి సతీసహగమన దురాచారాన్ని చట్టరీత్యా నిషేధింపజేసి తాను చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చుకున్నాడు. ఆ బాలుని పేరు రాజారామమోహన్ రాయ్.

# నామదేవుని ఏకాత్మభావన

నామదేవుడు ఉన్నతస్థాయికి చెందిన భక్తుడు, సిద్ధపురుషుడు, మహాత్ముడు. ఆయన విఠల్‌దేవునికి శరణాగతి చెందిన భక్త శ్రేష్ఠుడు. ఒకనాడు నామదేవుడు భోజనానికి కూర్చున్నాడు. ఆయన రోజూ ఎవరో ఒకరికి భోజనం పెట్టి కాని భుజించేవాడు కాదు. కాని, ఆ రోజున ఆ సమయానికి ఎవ్వరూ భోజనానికి రాలేదు. నామదేవుడు ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఇంతలో ఒక కుక్క అక్కడికి వచ్చింది. దానినిచూచి నామదేవుడు పరమానంద భరితుడయినాడు. ఆయన కన్నులలో కోటి కాంతులు వెలిగాయి. ఆయన అన్నాడు, 'నిజంగా తమరు ఎవరో మహాత్ములు. ఆ ప్రభువు తమను నా వద్దకు పంపాడు. తమరు విచ్చేసినందుకు నేను ధన్యుణ్ణి.' ఆయన లేచాడు. ఆ కుక్క ముందు పళ్ళెంలో రొట్టె పెట్టాడు. వెనుకకు వెళ్ళి మరలా వచ్చాడు. చూస్తే ఆ కుక్క రొట్టెను నోట కరుచుకుని పరుగెత్తుతోంది. నామదేవుడు కేకవేశాడు. 'అరే భగవాన్, ఏమిటి తమరు ఇలా చేశారు! ఇది ఎండురొట్టె. దానికి నెయ్యి రాయలేదు. దానిని తమరు తినడం కష్టం. ఆగండి మహానుభావా. నేను దానికి నేయి రాస్తాను. అతిథికి ఇట్టిభోజనం పెడితే నాకు పాపం తగులుతుంది.' నేతి గిన్నె తీసుకొని ఆయన ఆ కుక్క వెంటపరుగెత్తాడు. కుక్కముందు, నామదేవుడు వెనుక. వారు పరుగు పందెంలో ఉన్నారా అనిపించింది. నామదేవుడు అరుస్తున్నాడు, 'మహరాజ్, తమకు బాగా ఆకలివేసినట్లుగా ఉంది. క్షమించండి. నేయి తేవడం కొంచెం ఆలస్యమయింది.' చివరకు నామదేవుడు కుక్క దగ్గరకు రానే వచ్చాడు. తటాలున కుక్కనోట్లోనుండి రొట్టెను లాక్కొని నేయిరాచి దాని నోటికి అందించి, ఇలా అన్నాడు, 'స్వామీ, ఇప్పుడు తినండి. రొట్టె రుచిగా ఉంటుంది. ఎండురొట్టె కాదిది'. కుక్క రొట్టెను తినేసింది. నామదేవుడు మనస్సు కుదుటపడింది. ఆయన ఇంటికి

వెళ్ళాడు. అప్పుడు ఆయన పొందిన ఆనందం, అద్భుతం, దివ్యం - వర్ణనాతీతం. అంతటా ఆత్మను సాక్షాత్కారింపజేసుకున్న సమదర్శనుడు నామదేవుడు. ఆయన ప్రసిద్ధ భారతీయ భక్తాగ్రేసరుడు.

# గాంధీజీ పరిశ్రమ

ఒక సంస్కృతి ప్రాధ్యాపకుడు(ప్రొఫెసర్) గాంధీజీని కలుసుకోవాలనుకున్నాడు. ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ బావి దగ్గర నీళ్ళు తోడుతున్న ఒక సామాన్య వ్యక్తిని చూచాడు. ఆ సంస్కృత ఆచార్యుడు అడిగాడు, 'నేను మహాత్ముణ్ణే కలవాలి. ఇప్పుడాయన ఎక్కడుంటారు?' సామాన్యంగా కనిపించే ఆ వ్యక్తి తన ఎదుట ఆధునిక వేషం ధరించి వచ్చిన ఆ ప్రొఫెసర్‌వైపు పరిశీలించి చూస్తూ ఇలా అన్నాడు, 'అవును చెప్పండి. వారితో మీరు ఏం మాట్లాడాలి?' ఇలా అంటూ ఆ వ్యక్తి చెట్ల వద్దకు వెళ్ళాడు. తీసుకుని వచ్చిన నీటితో ఆ మొక్కలను తడిపాడు. ప్రొఫెసర్ కూడా ఆ వ్యక్తితో పాటు అక్కడిదాకా వెళ్ళి ఇలా అన్నాడు 'చూడండి ఈ విషయాన్ని మీరు అర్థం చేసుకోలేరు. వారిని కలిసి నేను మాట్లాడాలి.' ఆ వ్యక్తి అన్నాడు, 'ఓహో! అలాగా! అయితే మీరు నాతో పాటు బావి దగ్గరకు రండి గాంధీజీని కలుసుకోవచ్చు.'

ఇద్దరూ కలసి బావి దగ్గరకు వెళ్ళారు. అక్కడికి వెళ్ళిన తర్వాత ఆ వ్యక్తి కూర్చుని పాత్రలు తోమటం మొదలుపెట్టాడు. ప్రొఫెసర్ విసుక్కుని అన్నారు, 'భలేవారు మీరు. చూడండి నా సమయం ఎంత వృధా చేశారో!' పాత్రలు తోముతూ, తోముతూ గాంధీజీ ఎంతో సౌమ్యంగా, సరళంగా చెప్పారు 'నేనే గాంధీని. చెప్పండి, మీరు నాతో ఏం మాట్లాడాలి?' ప్రొఫెసర్ మహాశయుడు ఆశ్చర్యచకితుడై వారిని చూస్తూ ఉండిపోయాడు. ఆయననోట మాటరాలేదు. ఈయన నిజంగా మహాత్ముడే అని అనుకున్నాడు. పరిశ్రమ యొక్క విలువ ఏమిటో ఆయనకు ఇప్పుడు అర్థమయింది. ఆయన గాంధీజీ జీవితమనే పుస్తకంతో సంభాషణ జరిపి, నమస్కరించి వెళ్ళిపోయాడు.

# భారతమాత సేవకై తల్లి అనుమతి

చాలా కాలం నాటి సంగతి. ప.పూ. శ్రీగురూజీ (శ్రీ మాధవరావ్ సదాశివ గోల్వల్కర్ జీ) మాతృదేవికి అకస్మాత్తుగా పక్షవాతం సంభవించింది. సమాచారం అందగానే గురూజీ మాతృదేవి వద్దకు వచ్చారు. వారి ప్రక్కన శ్రేయోభిలాషిగా డాక్టర్ థట్టే నిరంతరం ఉండేవారు. గురూజీ వారి చేత తల్లికి పరీక్ష చేయించారు. డాక్టర్ థట్టే పరీక్షించి చెప్పారు. అది పక్షవాతం. దానికి సంపూర్ణమైన చికిత్స అంటూ లేదు.

విశేషజ్ఞులైన డాక్టర్లను పిలిపించారు. తల్లికి చికిత్స మొదలైంది. గురూజీ నిరంతరం పర్యటనలో ఉంటారు....సంఘకార్య నిమిత్తం వారెప్పుడూ ప్రయాణం చేస్తూ ఉండేవారు. ఇప్పుడు వారు వచ్చిన పని పూర్తయింది. కాని మాతృభక్తులైన గురూజీ తల్లి అనుమతి లేకుండా ఈ స్థితిలో వదలి పర్యటనకై ఎలా వెళ్తారు? అనుమతి కొరకు వారు తల్లి పాదాల వద్ద కూర్చున్నారు. తల్లికి ప్రణామం చేసి అత్యంత వినయ శబ్దాలతో ఇలా అడిగారు, 'అమ్మా, అనేక ప్రదేశాలలో కార్యక్రమం యోజన చేయబడింది. ఈ రోజు వెళ్ళాలని నిశ్చయం అయింది. మీరు అనుమతిస్తే మీ వద్ద శెలవు తీసుకుంటాను.'

తల్లి ఆ సమయంలో అమితమైన బాధలో ఉన్నారు. తనయుని భుజస్కంధాలపై గల గురుతర బాధ్యతను గురించి ఆమె అప్పుడు ఆలోచించలేకపోయినారు. ఆమె సహజమైన వాత్సల్యంతో 'వద్దు,' అని అన్నారు. తల్లి మాటలు గురూజీకి శిలాశాసనాలు. వారు ఆ క్షణంలో మనసులో అనుకొన్నారు, అమ్మకు నేను వెళ్ళాలని లేదు. అన్ని ప్రదేశాలకు తంతిద్వారా కార్యక్రమాన్ని రద్దు చేస్తూ సూచనలు పంపించాలి. కాని మరల మనస్సులో

స్ఫురించింది, నిశ్చయింపబడిన నా కార్యక్రమం రద్దు కావటం అమ్మకు ఏమాత్రం ఇష్టం ఉండదు. బహుశా బాధ ఎక్కువగా ఉన్నందువల్ల ఆమె మనస్సు సరిగా పనిచేయక పోవచ్చు. కొంచెంసేపు అయిన తరువాత మరల ఒకసారి అమ్మను అడిగి చూస్తాను.

ఇలా అనుకొని వారు ఎక్కడికీ సూచనలు పంపలేదు. కొన్ని గంటల తరువాత గురూజీ మరల మాతృదేవి చరణ సన్నిధికి వచ్చారు. ఆమెకు తమ కార్యక్రమం విన్నవించి పర్యటనపై వెళ్ళేందుకు అనుమతి వేడారు. తల్లి వాత్సల్యంతో గురూజీవైపు చూసి ఇలా అన్నారు, 'ఔను నాయనా, వెళ్ళు, నీ కర్తవ్యాన్ని నిర్వహించు.' కొన్ని క్షణాలు ఆగి ఆమె మళ్ళీ ఇలా అన్నారు; 'నాయనా, మనిషి జీవించడం లేదా మరణించడం ఒకరు దగ్గర ఉండటం మీద లేక ఉండకపోవడం మీద ఆధారపడి లేదు. ఇప్పుడు నా సేవ కంటే ఎక్కువగా భారత మాతృసేవ అవసరమై ఉంది. నీవు నన్ను గురించి ఆలోచించకు. ప్రాణుల దుఃఖాన్ని దూరం చేసేందుకు ప్రయత్నించు' గురూజీ నేత్రాలు ఆర్ద్రములైనాయి. మాతృవాత్సల్యానికి పరవశులై వారు తల్లి చరణాలకు ప్రణమిల్లి తమ కర్తవ్యపథంలో ముందుకు సాగివెళ్ళారు.

# నలుబది ముత్యాలు

గురుగోవింద్ సింహుడు, ఆయన అనుయాయులు ఆనందపూర్ కోటలో ఉన్నారు. మొగలు సైన్యాలు కోటను ముట్టడించాయి. బయట నుండి ఆహారపదార్థాలేవి లోనికి రావటంలేదు. కోట లోపల ఆహార సామాగ్రి ఎన్ని రోజులు వస్తుంది? చివరకు చెట్ల ఆకులు, చెట్ల బెరడు తిని యుద్ధం చేయవలసిన పరిస్థితి ఏర్పడింది.

కొందరు శిష్యులు కోట విడిచి వెళ్ళిపోయేందుకు సిద్ధమైనారు. వారు ఈ కష్టాలు సహించలేకపోయారు. గురుదేవులు ఇలా చెప్పారు, 'మంచిది వెళ్ళదలుచుకున్నవారు వెళ్ళండి, కాని వారు నాకు శిష్యులు కారు, నేను వారికి గురువును కాదు. ఇలా వ్రాసి ఇచ్చి వెళ్ళండి' కష్టాలను సహించే శక్తి లేని కొందరు శిష్యులు అదేవిధంగా వ్రాసి ఇచ్చారు. వారు కోట వదలి వెళ్ళిపోయారు. వారు తమతమ ఇళ్ళకు వెళ్ళారు. వారి భార్యలకు సంగతి యావత్తూ తెలిసిపోయింది. భార్యలు భర్తలను గట్టిగా చివాట్లు పెట్టారు.

తత్ఫలితంగా వారిలో కొందరు మళ్ళీ గురువుదగ్గరికి వెళ్ళి యుద్ధం చేసేందుకు సిద్ధమైనారు. ఆ సమయంలో గురుగోవింద్‌సింగ్ ఆనందపూర్ చమకార్ కోటల నుండి బయలుదేరి ముక్తసర్ ప్రాంతంలో తిరుగుతున్నారు. మొగలు సైన్యం వారిని వెంటాడుతోంది.

ఈ శిష్యులు ముక్తసర్ అనే చోటికి వెళ్ళి మొగలు సైన్యంతో ఢీకొన్నారు. యుద్ధం చేస్తూ మరణించారు. గురుగోవింద్ సింహునికి ఇది తెలిసింది. ఆయన యుద్ధం జరిగిన చోటికి వచ్చారు. నలుబది మంది శిష్యులు పరాక్రమంతో పోరాడి రణరంగంలో పడి ఉన్నారు. వారిలో ఒక శిష్యుడు ఇంకా జీవించే ఉన్నాడు. అతడు మూలుగుతున్నాడు. గురుదేవుడు అతనిని ఆప్యాయతతో పలకరించి ఆశీర్వదించాడు. అతని అంతిమ కోరిక ఏమిటని అడిగాడు. అతడు చేతులు జోడించి ఇలా అన్నాడు, గురుదేవ్.మేము సంతకం చేసి మిమ్మల్ని వదలి వెళ్తున్నాం అని వ్రాసి ఇచ్చిన కాగితాన్ని చించిపారవేయవలసిందిగా కోరుతున్నాను.

గురుదేవుడు అతని చివరికోరికను మన్నించి అలాగే చేశాడు. ఆ నలుబది మందికి ముక్తి లభించేటట్లు ఆశీర్వదించాడు. అప్పుడే శిష్యుడు ప్రాణాలు వదలిపెట్టాడు. ఆ నలుబది వీరపురుషులు అప్పటి నుండి నలుబది ముత్యములు అని పిలువబడ్డారు.

# దేవతలు, అసురులు

పూర్వకాలం నాటి సంగతి. అప్పుడు దేవతలు రాక్షసులు భూమి మీదకి వస్తూ పోతూ ఉండేవారు. ఒకసారి ఒక గృహస్థుని ఇంట శుభకార్యం జరిగింది. అప్పుడు అతడు చాలా మంది విద్వాంసులను విందుకు ఆహ్వానించాడు. ఆ విందుకు దేవతలు వచ్చారు. రాక్షసులు వచ్చారు.ఋషులు, మునులు ఎందరో విద్వాంసులు కూడా వచ్చారు.

భోజనాలకు అంతా కూర్చోబోతున్నారు. అప్పుడు అసురులు ఆ గృహస్వామిని పిలిచి ఫిర్యాదు చేశారు. మీరు మా అసురుల పట్ల ఎప్పుడూ పక్షపాతంగానే వ్యవహరిస్తుంటారు. ఇది న్యాయం కాదు, ఇది మాకు అవమానం ఈ రోజు నుండి మీరిలా చేస్తే మేము సహించేదిలేదు. ఆ గృహస్వామి చేతులు జోడించి అన్నాడు 'మీ పట్ల మేము చేసిన అవమానమేమిటి? దయచేసి స్పష్టంగా చెప్పండి.'

అసురులలో నుండి ఇద్దరు ముగ్గురు వ్యక్తులు ముందుకు వచ్చారు. కోపంతో బుసలు కొడుతూ ఇలా చెప్పారు, 'మీరు ప్రతిచోట దేవతలనే ముందర అడుగుతారు. వారికే ముందు వడ్డిస్తారు. ఇది అన్యాయం కాదా? ఈ రోజు నుండి అది కుదరదు.'

అప్పుడు ఇంకొక అసురుడు ఇలా చెప్పాడు 'అసలు మేము దేవతల కంటే ఏ విషయంలో తక్కువ. వారిని మాతో శాస్త్ర చర్చ జరపమనండి. సంగీతంలో గాని, యుద్ధ విద్యలోగాని, కూట నీతిలోగాని దేనిలోనైనా సరే.'

ఆ గృహస్వామి అసురులకు నచ్చ చెబుతూ అన్నాడు 'మీరు విద్వాంసులు. కోపం తగ్గించుకోండి. శాంతించండి. ఈ రోజున మీరే ముందు భోజనం చేయండి. కాని ఒక షరతు. భోజనం చేసే వారందరికి, వారు దేవతలు కావచ్చు అసురులు కావచ్చు, చేతులకు ఒక కర్ర బంధింపబడుతుంది. అదే స్థితిలో ఒక నిర్ణీత సమయంలో వారు భోజనం చేయాలి. కడుపు నిండా ఎవరు భోజనం చేస్తారో వారిని జ్ఞానులు అని పరిగణిస్తాం.'

'మేము ఈ షరతుకు అంగీకరిస్తున్నాం. పదండి. భోజనం వడ్డించండి ' అసురులు ఉత్సాహంతో చెప్పారు.

అసురులందరి చేతులకు భుజం నుండి అరచేతి వరకు ఒక తిన్నని కర్ర బంధింపబడింది. ఎవరూ తమ మోచేతులను వంచలేని స్థితిలో ఉన్నారు. పంక్తిలో భోజనం వడ్డించారు.

గృహస్వామి చేతులు జోడించి ప్రార్థించాడు, 'మహాత్ములారా దయచేసి భోజనం ఆరంభించండి. అసురులు వచ్చి పంక్తిలో కూర్చున్నారు. విస్తళ్ళలోని అన్నపు ముద్దను ఎత్తుకొని నోటిలో పెట్టుకొనేందుకు ప్రయత్నించారు. కాని సాధ్యంకాలేదు. చేయి తలపైకి తలక్రిందకి పోతున్నది కాని నోటి వద్దకి రావటంలేదు. ప్రతివాడికి తన పొట్ట నింపుకోవటమే పరమావధిగా వుంది. ప్రక్కవాణ్ణి గురించిన ధ్యాసే లేదు. కర్ర బంధింపబడి ఉండడం వల్ల మోచేయి వంగటంలేదు. వారు అన్నం ఒక ముద్ద కూడా తినలేకపోయినారు. పైగా

హల్వాపూరీ, పాలు, బూందీ మొదలైన వన్నీ వాళ్ళ నెత్తి మీద పడుతున్నాయి. వారి పరిస్థితి చూసి అందరికీ నవ్వు వస్తోంది.

ఇప్పుడు దేవతల వంతు వచ్చింది. వారికి కూడా రెండు చేతులకు కర్రలతో అదేవిధంగా బంధించారు. పంక్తిలో భోజనం వడ్డించారు. గృహయజమాని చేతులు జోడించి చెప్పాడు, 'దేవతలారా, దయచేసి భోజనం ఆరంభించండి' దేవతలు ఇప్పుడు ఇద్దరు కలిసి ఎదురెదురుగా కూర్చున్నారు. ప్రతివాడు తన విస్తట్లో ఉన్న అన్నాన్ని ఎదుటివాని నోటికి అందించి తినిపించాడు. ఇలా దేవతలందరూ పరస్పరం సహకరించుకొని చేతులు వంచకుండానే కడుపు నిండా భుజించారు. అసురులు సిగ్గుతో తలవంచుకున్నారు. వారికి ఇంగిత జ్ఞానం లేదు. పరస్పర సహకారం లేదు. ఈ సంగతి వారికి అర్థమయింది. వారు ఎవరితో చెప్పకుండా చల్లగా జారుకున్నారు.

# జగత్కల్యాణ భావన

పిప్పలాద మహర్షి దధీచి కుమారుడు. తల్లి పేరు సువర్మ. సువర్మ పరమ సాధ్వి.

పిప్పలాదుడు పసివాడిగా ఉన్నప్పుడు ఒకనాడు దధీచి ఆశ్రమానికి దేవరాజైన ఇంద్రుడు వచ్చాడు. ఆయన వెంట కొందరు దేవతలు కూడా వచ్చారు. వృత్రాసురుణ్ణి సంహరించేందుకు దధీచి వెన్నెముక కావాలని ఇంద్రుడు అడిగాడు.

దధీచి గొప్పదాత. ఇంద్రుని కోరికను మన్నించి వెంటనే సమాధిస్థుడై ప్రాణ త్యాగం చేసి తన ఎముకలను ఇచ్చాడు. ఆ ఎముకలతో విశ్వకర్మ

వజ్రాయుధాన్ని తయారుచేశాడు. దానితో ఇంద్రుడు అత్యాచారాలు చేస్తున్న వృత్రాసురుణ్ణి సంహరించాడు. దేవతలను రక్షించాడు.

పిప్పలాదుడు పెద్దవాడైనాడు. తండ్రి చేసిన దేహత్యాగం గురించి విన్నాడు. ఆయన అస్థికల ద్వారా దేవతలు వజ్రాయుధాన్ని తయారుచేసిన సంగతి విన్నాడు. విషయమంతా విన్న పిప్పలాదుడు క్రోధంతో కంపించిపోయాడు. దేవతలు స్వార్థపరులు అని అతనికి తోచింది. వారిపట్ల ద్వేషం కలిగింది. ఈ దేవతలుగా చెప్పబడే స్వర్గవాసులు ఎంతటి స్వార్థపరులు. తమను రక్షించుకొనేందుకు నా తండ్రి అస్థికలు కోరారు. వీరికి సిగ్గులేదు. ఈ దేవతలను నేను భస్మం చేస్తాను అని పిప్పలాదుడు ఒక ప్రతిజ్ఞ చేశాడు. దేవతలపై పగ తీర్చుకుంటానన్నాడు. రోజంతా అతనికి తండ్రి యొక్క గాథ లోపల తొలుస్తుండేది. బాగా ఆలోచించిన మీదట అతడు తపస్సు చేయటానికి నిశ్చయించుకున్నాడు. తపస్సు ద్వారా శంకరుణ్ణి ప్రసన్నం చేసుకుంటాను. దేవతలను నాశనం చేయవలసిందని వరం కోరతాను.

బాలుడైన పిప్పలాదుడు గోమతీ నదీ తీరంలో తపస్సు చేయసాగాడు. రోజులు , నెలలు, సంవత్సరాలు గడిచిపోయాయి. చలి, వేడి, ఆకలి, దప్పిక అన్నింటికి తట్టుకొన్నాడు. అనేక రకాలైన కఠిన వ్రతాలు ఆచరించాడు. ఎండిన పుల్ల అయినాడు. పరమేశ్వరుడి సింహాసనం కదిలింది.

పిప్పలాదుడి భక్తికి మెచ్చి శివుడు ప్రత్యక్షమైనాడు. ఆయన త్రిశూలం తీసుకొని పిప్పలాదుని వద్దకు వచ్చాడు. 'వత్సా, నీ భక్తికి మెచ్చాను. వరం కోరుకో ఇస్తాను' అని చెప్పాడు. పిప్పలాదుడు కళ్ళు తెరిచాడు. శివుణ్ణి చూసి విలపించాడు. తర్వాత విన్నవించాడు, 'ప్రభూ మీరు రుద్రరూపాన్ని ధరించి దేవతలందరినీ భస్మం చేయండి' శివుడు ఇలా చెప్పాడు, 'పిప్పలాదా, ఇది చాలా

సులభం. కాని నా రుద్ర రూపంతో కేవలం దేవతలే కాదు. సృష్టి యావత్తూ భస్మమైపోతుంది. నీవు కూడా సజీవంగా ఉండవు.' 'పరమేశ్వరా, నేను అంగీకరించను. అనేక శాస్త్రాలు నేను కూడా అధ్యయనం చేశాను. మీ రుద్రరూపం వల్ల నేనెందుకు భస్మం అవుతాను. భూలోకవాసులు ఎందుకు భస్మమౌతారు?' పరమేశ్వరుడు చిరునవ్వు నవ్వాడు. ఆయన పిప్పలాదుడితో చెప్పాడు,

'వత్సా, ఒక క్షణ కాలం నీవు నా రుద్రరూపాన్ని దర్శించు. హఠాత్తుగా ఒక ప్రచండమైన తేజస్సు శంకరుని మూడవ నేత్రంలో నుండి ఉద్భవించింది. అందులోని ఒక కణం పిప్పలాదుని శరీరంలోపల దూరింది. పిప్పలాదుణ్ణే అది ప్రచండమైన అగ్నిలాగా దహించివేయసాగింది. అతనికి మహావిధ్వంసం జరిగినట్లు అనుభూతి కలిగింది. అతడు కేకలు వేయసాగాడు. మూర్ఛపోయాడు. కొంచెంసేపటికి అతడికి స్పృహ వచ్చింది. అతడు కళ్ళు తెరచి చూశాడు. అప్పటి వరకు పరమేశ్వరుడు అక్కడే నిల్చుని ఉన్నాడు. ఆయన స్వరూపం సౌమ్యంగా ఉంది. పిప్పలాదుడు చేతులు జోడించి చెప్పాడు,' పరమేశ్వరా, నేను ఈ తేజస్సును భస్మమయ్యేలా ఉన్నాను.'

'వత్సా, సృష్టి అంతా భిన్నమౌతున్నప్పుడు నీవు మిగులుతావా? ఆలోచించు. నీతండ్రి దధీచి జగత్కల్యాణార్థం తన అస్థికలు కూడా ఇచ్చి వేశాడు. నీవు ప్రపంచానికి అమంగళం ఆలోచిస్తున్నావు.'

పిప్పలాదుడు మౌనంగా తల వంచాడు. అతనికి తనపై తనకే అసహ్యం వేసింది. పరమేశ్వరుడు పిప్పలాదుడికి ఇలా నచ్చచెప్పాడు, 'వత్సా, విధ్వంసం ఏదో ఒక చోట ఆరంభమవుతుంది. అది వ్యాపిస్తుంది చూడు. బ్రహ్మాం డంలో ఉన్నదే పిండంలో కూడా ఉన్నది. దేవతలు స్వర్గంలోనే కాదు, నీ శరీరంలో

కూడా ఉన్నారు. నీ చేతుల్లో ఇంద్రుడు, నేత్రాలలో సూర్యుడు, ముక్కులో అశ్వినీ కుమారులు మనసులో చంద్రుడు ఉన్నారు. ఇలాగే ప్రతి ఇంద్రియమునకు, ప్రతి అవయవానికి దేవతలున్నారు. వారిని నీవు నశింప చేద్దామనుకుంటున్నావా?'

'లేదు, పరమేశ్వరా, లేదు, పిప్పలాదుడు చెప్పాడు, నేను కూడా తండ్రి మాదిరిగానే జగత్కల్యాణార్థమై పవిత్రమైన కార్యాలు చేస్తాను.' ఇలా చెప్పి ఆయన మౌనం వహించాడు.

# ఆదర్శ కుటుంబ జీవనం

ఒకసారి ఒక గృహస్థుడు కబీర్‌దాస్ వద్దకు వచ్చాడు. అతడు తన దాంపత్య జీవితంతో అసంతృప్తి చెందివున్నాడు. గృహస్థుడు అడిగాడు, 'భక్తాగ్రణీ, సుఖవంతమైన కుటుంబ జీవన రహస్యం ఏమిటి?'

కబీర్‌దాస్‌కు ఆ వ్యక్తి ముఖంలో నిరాశ నిస్పృహలు గోచరించాయి. అతనికి భార్యతో సయోధ్య లేదని అర్థమయింది. నీకిప్పుడే వివరిస్తాను అని చెప్పి కబీర్ ఇంటి లోపలికి వెళ్ళాడు. కొంచెంసేపయిన తరువాత ఇంట్లో నుండి దారపు కండెతో వచ్చాడు. ఆ వ్యక్తి ముందుకూర్చొని దారం చిక్కు తీయటం మొదలు పెట్టాడు. రెండు నిమిషాలు దాటిన తరువాత భార్యను పిలిచి, 'ఇక్కడ చీకటిగా వుంది. దారం చిక్కు విడటంలేదు దీపం ముట్టించి పెట్టు' అని చెప్పాడు.

కబీర్ దాస్ భార్య దీపం ముట్టించి పెట్టింది. మౌనంగా వెళ్ళిపోయింది. ఆ వచ్చిన వ్యక్తికి ఆశ్చర్యమేసింది. కబీర్ గ్రుడ్డివాడైపోయినాడా? సూర్యుని వెలుతురు ఉండగా ఈయనకు చీకటిగా ఉన్నట్లు తోచింది. ఈయన భార్య

కూడా అలాంటిదే అయుండాలి. లేకపోతే జవాబు చెప్పకుండా దీపం తెచ్చి పెడుతుందా? ఈలోగా కబీర్ భార్య రెండు గ్లాసులతో పాలు తెచ్చింది. ఒక గ్లాసు ఆ వచ్చిన వ్యక్తికి ఇచ్చింది. రెండవది కబీర్‌కి ఇచ్చింది. ఇరువురూ పాలు త్రాగసాగారు. కొంతసేపయిన తరువాత ఆమె మళ్ళీ వచ్చింది. కబీర్‌ను పాలలో పంచదార సరిపోయిందా అని అడిగింది.

కబీర్ చెప్పాడు 'సరిపోయింది. చాలా తియ్యగా వుంది.' అదే భావంతో ఆయన పాలు త్రాగాడు. ఆ వ్యక్తి తబ్బిబ్బైనాడు. పాలల్లో పంచదార లేదు. పొరపాటున పంచదారకు బదులు ఉప్పు వేసినట్లుగా వుంది. అతడు మనసులో సతమతమవుతూ 'మహాత్మా, నాప్రశ్నకు జవాబు చెప్పలేకపోతే నేను శెలవు తీసుకొంటాను.' కబీర్ ఇలా చెప్పాడు, 'సోదరా నీకు జవాబు చెప్పి ఉన్నాను. ఇంకా వివరంగా వినదలుచుకొంటే ఇదుగో చెబుతున్నాను విను. కుటుంబ జీవనం సుఖవంతంగా సాగాలంటే దానికి కొన్ని నియమాలు ఉన్నాయి. కుటుంబంలోని సభ్యులను నీకు అనుకూలంగా చేసుకోవాలి. నీవు గూడా కుటుంబ సభ్యులకు అనుకూలంగా ఉండాలి. భార్యను, సంతానాన్ని సౌశీల్యవంతులుగా విధేయులుగా మలచుకోవాలి. నీవుగూడా స్నేహాన్నీ, క్షమాగుణాన్నీ అందరికీ పంచి ఇవ్వాలి. అప్పుడే కుటుంబ జీవనం సుఖవంతమవుతుంది.' ఆ వ్యక్తికి విషయం అర్థమయింది. సంతోషంతో ఇంటికి తిరిగి వెళ్ళాడు.

# నేను అపకారం చేయలేను

సూఫీ భక్తురాలు బీబీరాబియా దైవ ధ్యానంలో లీనమై ఉండేది. ఆమె కీర్తి చాలా దూరం వ్యాపించింది. ఆ రోజుల్లో ఇబలీస్ అనే పేరుగల గొప్ప నాస్తికుడు రాబియాను ఎప్పుడూ విమర్శిస్తుండేవాడు. నిందిస్తుండేవాడు. ఇబలీస్

విషయం రాబియాకు తెలిసింది. ఒకనాడు ఆమెను ఒక వ్యక్తి అడిగాడు, 'ఇబలీస్ ఎప్పుడూ మిమ్మల్ని నిందిస్తుంటాడు కదా. మీ నుండి ఎటువంటి ప్రతిక్రియ లేదు ఎందుచేత? దుష్టుడితో దుష్టంగానే వ్యవహరించటం ఉచితం కదా!'

దీనికి బీబీరాబియా ప్రశాంతంగా ఇలా సమాధానం చెప్పింది, 'మనం భగవంతుని సంతానం. ఇందువల్ల మనం సోదర సోదరులం. సోదరి తన సోదరునికి అపకారం చేయగలదా? నేను మాత్రం చేయలేను.' ఇబలీస్‌కు ఈ విషయం తెలిసింది. పశ్చాత్తాపంతో పరిగెత్తుకుంటూ వచ్చాడు. కన్నీళ్ళతో రాబియా ఎదుట నతమస్తకుడై నిల్చున్నాడు. తన అశ్రుధారలతో ఆమె చరణాలను కడిగాడు. ఇప్పుడు ఇబలీస్ మనసులో కల్మషం లేదు. అతను కూడా దైవభక్తుడైనాడు.

# నిజమైన ఉపాసన

కలకత్తాలో ప్లేగు వ్యాధి వ్యాపించింది. నలువైపులా హాహాకారాలు చెలరేగాయి. కాల పురుషుని కరాళనృత్యం అది. జనులు అసంఖ్యాకంగా మరణించారు. స్వామి వివేకానందుడు తన సాధన, ఉపాసన పక్కన పెట్టి ప్రజలను రక్షించేందుకు సేవా కార్యక్రమాలు ప్రారంభించాడు. ఒక వ్యక్తి వారిని అడిగాడు, 'స్వామీజీ మీ ఉపాసన ఏమయింది?' స్వామి జవాబు చెప్పారు, 'భగవంతుని పుత్రులు మరణ ముఖంలో ఉండగా ఒకచోట సుఖంగా కూర్చుని నన్ను ఆ భగవంతుడి నామాన్ని జపించమంటారా? మీరు దీనినే ఉపాసన అని అనుకుంటున్నారా?' ప్రశ్నించిన వ్యక్తి మౌనంగా వారి వంక చూశాడు.

సేవా కార్యక్రమాల సందర్భంగా డబ్బు అవసరమైంది. స్వామీజీ రామకృష్ణ ఆశ్రమ స్థలాన్ని అమ్మటానికి సిద్ధపడ్డారు. ఒక శిష్యుడు ప్రశ్నించాడు, 'స్వామీజీ

మీరు మన గురువు స్మారక చిహ్నాన్ని అమ్ముతారా? వివేకానందుడు సమాధానం చెప్పారు, 'మఠాలు, మందిరాలు మానవులకు మేలు చేసేందుకు ఏర్పడతాయి అవి జనోపయోగానికి కాకపోయినట్లయితే నిర్జీవ పాషాణములుగా మాత్రమే మిగులుతాయి. మంచి కార్యం కోసం వినియోగించటం వల్ల రాళ్ళల్లో కూడా భగవంతుడు మాట్లాడతాడు. ఇదే నిజమైన గురుసేవ, ప్రభుసేవ.'

# ఊడ్చేవాడు రాష్ట్రపతి అయినాడు

ఓహియో వనంలో గార్ఫీల్డ్ తల్లి ఉండేది. ఆమె విధవరాలు. ఆమెకు బ్రతుకు తెరువుకు ఒకటే మార్గం. అడవి నుండి కట్టెలు కొట్టి తేవడం. గ్రామాలలో అమ్మటం. తన పిల్లవాణ్ణి గుడిసెలో ఉంచి గొళ్ళెంపెట్టి పనికి బయటికి వెళ్ళేది. అయినా కూడా ఆమెకు లోపల భయం ఉండేది. తోడేళ్ళు వచ్చి పిల్లవాడిని చంపుతాయేమో అని. ఇంటికి తిరిగి వచ్చిన తరువాత రాత్రివేళ వాత్సల్యంతో ఆమె పిల్లవాణ్ణి ముద్దాడేది, చదివించేది. దాచి పెట్టిన డబ్బుతో ఆమె ఒక కంచర గాడిదను కొన్నది. కట్టెలు ఇప్పుడు గాడిద మోస్తోంది. గార్ఫీల్డ్‌కు చదువుకోవాలని ఉండేది. అతనికి ఒక గ్రంథాలయంలో కసువు ఊడ్చే పని లభించింది. అతడు స్కూల్లో కూడా చదువుకొనేవాడు. గ్రంథాలయంలోని పుస్తకాలు చదివి జ్ఞానాన్ని పెంపొందించుకొనేవాడు. పట్టుదల, అధ్యయనం, పరిశ్రమ, నిజాయితీ మొదలైన సద్గుణాలుంటే ఆ గుణాలు మనిషిని ఎంత పైకి అయినా తీసుకొని వెళ్తాయి. ఇప్పుడు ఆ యువకుడు గ్రాడ్యుయేట్ అయినాడు. అతనికి మంచి ఉద్యోగం దొరికింది. అతడు కేవలం పొట్ట నింపుకొనేందుకు ఉద్యోగం చేయలేదు. అది అతనికి జీవనలక్ష్యం కాదు. సేవా భావంతో స్వదేశీయుల కష్టాలు దూరం చేయటంలో అతడు తన సమయాన్ని గడిపేవాడు. ప్రగతిపథంలో పయనిస్తున్న గార్ఫీల్డ్ అమెరికా సెనేట్ సభ్యుడుగా

ఎన్నుకోబడ్డాడు. ఆ తరువాత ఎన్నికలలో ప్రజలు అతనిని రాష్ట్రపతిగా ఎన్నుకొన్నారు. పురుషార్థాన్ని మించినది లేదు.తమకు తాము సహాయం చేస్తున్నవారికి భగవంతుడు కూడా సాయపడతాడు. సంకల్పశక్తి, క్రియాశీలత వుంటే అన్ని ఆటంకాలు అణగిపోతాయి. లక్ష్య సిద్ధికై మార్గం సుగమం అవుతుంది. గార్ఫీల్డ్ జీవితం ధ్యేయనిష్ఠ కలిగిన ఒక ఉదాహరణగా మన ముందు ఉంది.

# ఆచార్యుని ఆచరణ

'సత్యము, సదాలోచన, సదాచరణలలో శిక్షణ ఇచ్చేందుకు నేనొక శిక్షణాలయం ప్రారంభించాలనుకుంటున్నాను.' యూనాను దేశానికి సంబంధించిన ఒక వృద్ధ తత్త్వవేత్త తన మిత్రునితో అన్నాడు. ఆయన ఇంకా ఇలా అన్నాడు, 'తగిన స్థలం కూడా నేను ఎన్నుకొన్నాను. అయితే ఒక ఇబ్బంది ఉంది. ఇలాంటి శిక్షణ పొందేందుకు విద్యార్థులు లభించటంలేదు. ' మిత్రుడు వింటూ ఉన్నాడు. 'మీరు గొర్రెలను కొనండి. వానినే శిష్యులుగా భావించండి.' చదివించటం మొదలుపెట్టండి అని అన్నాడు. మిత్రుని మాటలలో వ్యంగ్యం ఉంది. కొన్నాళ్ళకు విద్యాలయంలో కేవలం ఇద్దరు బాలురు చేరారు. గురువు ఆ ఇరువురికీ నిశ్చల మనసుతో ఆరాధనా భావంతో చదువు చెప్పసాగాడు. ఆ విద్యాలయాన్ని గురించి విన్న ప్రతివారు ఆ వృద్ధునికి పిచ్చి పట్టింది అన్నారు. ఈ తీవ్రమైన విమర్శబాణాలు ఆ సాధకుణ్ణి మార్గచ్యుతుణ్ణి చేయలేకపోయాయి. సాధన నిరాటంకంగా సాగిపోయింది. శిక్షణ పూర్తయింది. విద్యార్థులు విద్య పూర్తయిన తరువాత ఇంటికి బయలుదేరారు. ఇప్పుడు వారు జ్ఞానమూర్తులు. సత్యవాదులు. వివేకశీలురు. వారు చెప్పే మాటకు, చేసే పనికి తేడా

ఉండేదికాదు. ఇది చూసి ప్రజలు ఆశ్చర్యచకితులైనారు. అనుకున్నదానిని పట్టుదలతో, నిజాయితీతో, పరిశ్రమతో ఆ తత్త్వవేత్త సాధించాడు. ఆయనకు అందరూ నతమస్తకులైనారు. ఆ సంస్థ క్రమంగా అభివృద్ధి చెందింది. విద్యాలయం విశ్వవిద్యాలయం అయింది. ఆ ఇరువురి విద్యార్థులలోనూ ఒక వ్యక్తి యూనాన్‌కు సర్వసైన్యాధ్యక్షుడు అయినాడు. రెండవ విద్యార్థి ముఖ్యమంత్రి అయినాడు. ఆ సత్పురుషు విద్యార్థుల జీవితాలలోకి ప్రవేశించి వారి జీవితాలకు ఒక మార్గాన్ని చూపాడు. విద్యార్థుల దృష్టికోణాన్ని పూర్తిగా మార్చివేశాడు. ఆయన పేరిట ప్రస్తుతం జీనోవిశ్వవిద్యాలయం విశ్వవిఖ్యాతమైన శిక్షణ కేంద్రం అయింది. ఇట్టి ఆచార్యులు ధన్యులు. వారి ఆచరణ ధన్యము.

# వినమ్రత

డాక్టర్ మహేంద్రనాధ సర్కార్ కలకత్తాలో ఒక పేరున్న డాక్టర్. ఆయన సంపన్నుడు. ఒక రోజున రామకృష్ణ పరమహంసని కలుసుకోవడానికి వెళ్ళారు. పరమహంస తోటలో అటూ ఇటూ తిరుగుతున్నారు. ఆ డాక్టరు పరమహంసను చూచి తోటమాలి అనుకున్నాడు. 'ఏయ్ తోటమాలీ, పూలు కాసిని కోసి తీసుకొనిరా,' అని చెప్పాడు. 'పూలు మీకు దేనికి' అని ఆయన అడిగాడు. 'పరమహంస చరణాలపై సమర్పించేందుకు' అని ఆ డాక్టరు సమాధానం చెప్పాడు. ఆ మాలి మంచి మంచి అందమైన వికసించిన పూలుకోసి తెచ్చి ఇచ్చాడు. కొంతసేపటికి సత్సంగంలో భక్తులంతా వచ్చి కూర్చున్నారు. పరమహంస కూడా అక్కడికి వచ్చాడు. అందరూ తలలు వంచి ఆయనకు ప్రణమిల్లారు. డాక్టర్ మహాశయుడు తలపైకెత్తి చూసి నిర్ఘాంతపోయాడు. తాను

తోటమాలి అని భావించిన వ్యక్తియే రామకృష్ణ పరమహంస.

పరమహంస యొక్క వినమ్రత, సాధన అట్టివి.

# పరమవీరచక్ర జోగేందర్ సింహుడు

'సుబేదార్, మీరు వెనుకకు పోండి. మీరు వెంటనే ఆసుపత్రిలో చేరాలి.'

లేదు, నేను వెనుకకువెళ్ళను, నేను నా తొడకు కట్టు కట్టుకున్నాను. నీవు దిగులు పడనక్కరలేదు.

సుబేదార్ జోగిందర్‌సింహుకు తొడలో తుపాకి గుండు దూసుకొని పోయింది. దాన్ని అతడు ఏమాత్రం లెక్కచేయలేదు. ఆసుపత్రిలో చేరటానికి ఇష్టపడలేదు. దీనితో సైనికుల సాహసం ద్విగుణీకృతమైంది. సుబేదారు అంటున్నమాటలు వారికి వినిపించాయి. దేశరక్షణ నిమిత్తం ఒక తుపాకీగుండు ఏమిటి, వేయి తుపాకీ గుండ్లు దూసుకొనిపోయినా వెనుకకు తిరిగేది లేదు. సైనికులలో ధైర్యం పెరిగింది. శత్రువులకు గట్టిగా గుణపాఠం నేర్పేందుకు వారు ముందంజవేశారు.

సుబేదార్ జోగేందర్‌సింహ ఈశాన్య ప్రాంతంలో (నేఫా) టోంగ్ పెంగ్ - లా పర్వత శ్రేణుల దగ్గర సిక్కు రెజిమెంటులో ఒక ప్లాటూనుకు నేతృత్వం వహిస్తున్నాడు. 3 అక్టోబరు 1962 నాటి ఉదయం 5-30గం లకు చైనా దేశీయులు పెద్ద ఎత్తున దురాక్రమణ జరిపారు. త్రవాంగ్‌వైపు సులభంగా ముందుకు చొచ్చుకొని రావచ్చుననే ఉద్దేశ్యంతో వారీ దాడి జరిపారు. చైనా సైన్యంలోని మరొక బెటాలియన్ ఈ దాడి కోసం ముందుకు వస్తోంది. దురాక్రమణ అత్యంత చాకచక్యమయిన రీతిలో జరిగింది . ఇద్దరిద్దరు సైనికులు

మూడు వైపులనుండి ముందుకు వస్తున్నారు.

సుబేదార్ జోగీందర్ సింహ తన బృందంలోని సైనికులను యుద్ధానికి సంసిద్ధం కావించాడు. చైనీయుల మొదటి బృందం ముందుకు రాగానే భారతీయ వీర సైనికులు వారిమీద పెద్ద ఎత్తున విరుచుకుపడ్డారు. చైనా సైనికులు ఎక్కువ సంఖ్యలో మరణించారు. చైనా సైన్యం వెనుకకు తిరిగిపోయింది. కాని కొద్ది సేపట్లోనే ప్రక్కనే ఉన్న పర్వతాల గుండా శత్రువుల రెండోదళం దాడి చేసింది. సుబేదార్ జోగీందర్‌సింహ ఎంతో నేర్పుతో శత్రువులను ఎదిరించాడు. వారి ఈ రెండవ దాడిని కూడా త్రిప్పి కొట్టాడు.

జోగేందర్‌సింహ అతనితోటి సైనికులలో చాలా మంది గాయపడ్డారు. అయినా కూడా ధైర్యం కూడ గట్టుకొని ఉన్నారు. ఎట్టి పరిస్థితులలోనయినా వారు అక్కడినుండి తొలగిపోదల్చుకోలేదు.

దీని తరువాత చైనా సైనికుల మూడవ బృందం దాడి చేసింది. సుబేదార్ జోగీందర్ సింహ దీన్ని కూడా త్రిప్పికొట్టాడు. అతడు ఒక లైట్ మిషన్‌గన్ పుచ్చుకొని చాలా మంది శత్రుసైనికులను హతమార్చాడు. కాని శత్రువులు భారీ సంఖ్యలో ఉన్నారు. చైనా సైనిక అధికారులు వారి సైన్యాలను యుద్ధాగ్నిలో సమిధల్లాగా వేయిస్తున్నారు.

పెరుగుతున్న శత్రు సైనికుల సంఖ్యను చూచి సుబేదార్ జోగేందర్‌సింహ ఆలోచనలో పడవలసి వచ్చింది. అతడు తన బంకర్‌లో నుండి భారత్‌మాతాకీ జై, సత్ శ్రీ అకాల్,అని నినాదాలు చేశాడు. చేతిలో ఒక పొడుగాటి ఖడ్గం ధరించాడు. శత్రుసేనపై విరుచుకుని పడ్డాడు. శత్రుసైన్యాన్ని చీల్చి చెండాడటం మొదలుపెట్టాడు. తాను తీవ్రంగా గాయపడి నేలకొరిగే వరకు శత్రుసైనికులను

మూడు వైపులనుండి ముందుకు వస్తున్నారు.

సుబేదార్ జోగీందర్ సింహ తన బృందంలోని సైనికులను యుద్ధానికి సంసిద్ధం కావించాడు. చైనీయుల మొదటి బృందం ముందుకు రాగానే భారతీయ వీర సైనికులు వారిమీద పెద్ద ఎత్తున విరుచుకుపడ్డారు. చైనా సైనికులు ఎక్కువ సంఖ్యలో మరణించారు. చైనా సైన్యం వెనుకకు తిరిగిపోయింది. కాని కొద్ది సేపట్లోనే ప్రక్కనే ఉన్న పర్వతాల గుండా శత్రువుల రెండోదళం దాడి చేసింది. సుబేదార్ జోగీందర్‌సింహ ఎంతో నేర్పుతో శత్రువులను ఎదిరించాడు. వారి ఈ రెండవ దాడిని కూడా త్రిప్పి కొట్టాడు.

జోగేందర్‌సింహ అతనితోటి సైనికులలో చాలా మంది గాయపడ్డారు. అయినా కూడా ధైర్యం కూడ గట్టుకొని ఉన్నారు. ఎట్టి పరిస్థితులలోనయినా వారు అక్కడినుండి తొలగిపోదల్చుకోలేదు.

దీని తరువాత చైనా సైనికుల మూడవ బృందం దాడి చేసింది. సుబేదార్ జోగీందర్ సింహ దీన్ని కూడా త్రిప్పికొట్టాడు. అతడు ఒక లైట్ మిషన్‌గన్ పుచ్చుకొని చాలా మంది శత్రుసైనికులను హతమార్చాడు. కాని శత్రువులు భారీ సంఖ్యలో ఉన్నారు. చైనా సైనిక అధికారులు వారి సైన్యాలను యుద్ధాగ్నిలో సమిధల్లాగా వేయిస్తున్నారు.

పెరుగుతున్న శత్రు సైనికుల సంఖ్యను చూచి సుబేదార్ జోగేందర్‌సింహ ఆలోచనలో పడవలసి వచ్చింది. అతడు తన బంకర్‌లో నుండి భారత్‌మాతాకీ జై, సత్‌శ్రీ అకాల్,అని నినాదాలు చేశాడు. చేతిలో ఒక పొడుగాటి ఖడ్గం ధరించాడు. శత్రుసేనపై విరుచుకుని పడ్డాడు. శత్రుసైన్యాన్ని చీల్చి చెండాడటం మొదలుపెట్టాడు. తాను తీవ్రంగా గాయపడి నేలకొరిగే వరకు శత్రుసైనికులను

గాయపడ్డాడు. అయినా అతడు తన సైనికులలో ఉత్సాహం ఏమాత్రం శిథిలం కానీయలేదు. ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని అతడు శత్రువుతో యుద్ధం చేశాడు. శత్రు సైన్యానికి భారీ నష్టం వాటిల్లింది. వందలాది చైనా సైనికులు సంహరింపబడ్డారు.

సైతాన్ సింగు శరీరం అంతా జల్లెడలాగా తూట్లు పడింది. చేతులకు దారుణంగా గాయాలు తగిలాయి. నెత్తురు ఎక్కువగా కారిపోతోంది. కాని అతడు రణరంగం నుండి నిష్క్రమించటానికి సిద్ధంగాలేడు. అతని సహచరులు అతనిని వెనుకకు తీసుకువెళ్ళి ఆసుపత్రిలో చేర్చేందుకు ఎంతో ప్రయత్నించారు. కాని అతడు కదలకుండా అక్కడే నిల్చి శత్రువులతో పోరాడుతూ వీరస్వర్గం అలంకరించాడు.

మేజర్ సైతాన్‌సింగ్ ప్రదర్శించిన అపూర్వ సాహసం, కర్తవ్యనిష్ఠ, నేతృత్వ శక్తి కారణంగా అతని కంపెనీలోని ప్రతి సైనికుడూ ఆఖరి క్షణం వరకు పోరాడుతూనే వున్నాడు.

కామావ్రూ రెజిమెంటుకు చెందిన వీర సైతాన్‌సింగ్‌కు అతని ధైర్యసాహసాలను మెచ్చుకుంటూ మరణానంతరం పరమవీరచక్ర బిరుదును ప్రదానం చేశారు.

# నిజమైన దేశ భక్తుడు

ఒక పర్యాయం అమెరికారాష్ట్రపతి అబ్రహాంలింకన్ తనకు బద్ధ విరోధి అయిన ఒక వ్యక్తిని రక్షణ మంత్రిగా నియమించాడు. అతడు లింకన్‌ను నిశితంగా విమర్శిస్తుండేవాడు.

ఒక రోజున లింకన్ వద్దకు కొందరు శ్రేయోభిలాషులు, మిత్రులు వచ్చారు. వారన్నారు, 'రక్షణమంత్రి పదవిని ఆ వ్యక్తికి ఇచ్చారుకదా మీకు ఆయనకు గురించి బాగా తెలియదా?'

'తెలుసు' అని లింకన్ చెప్పాడు.

మిత్రులు చెప్పారు. 'అతడు మిమ్మల్ని పిచ్చివాడు' అని నిందించాడు. ఇంకా ఏవేవో మాటలతో మిమ్మల్ని చాలా సభలలో అవమానించాడు.

ఇదివిని లింకన్ 'ఇదంతా కూడా నాకు తెలుసు' అన్నాడు.

మిత్రులు కోపంతో అడిగారు, 'ఇదంతా తెలిసికూడా ఇంతటి ముఖ్యమయిన పదవిని ఆయనకు ఎందుకు కట్టబెట్టారు?'

లింకన్ ముఖంపై సహజమైన ఒక చిరునవ్వు వెలిగింది. ఆయన ఇలాఅన్నారు. 'అయితే ఏమి? ముఖ్యమయిన పదవి అప్పగించినమాట నిజమే. అయితే అర్హతలేనిచోట కూర్చుండ పెట్టలేదు కదా!'

మిత్రులు అన్నారు 'మీకు ఇది ఎందుకుఅర్థంకాదు......' మిత్రులు తమమాట పూర్తి చేయనేలేదు. లింకన్ మధ్యలోనే వారిని ఆపి ఇలా చెప్పాడు. 'నేను మిమ్మల్ని అర్థంచేసుకునేలోపల మీరెందుకు ఈ విషయాన్ని అర్థం చేసుకోరు? అతడు యోగ్యమయిన వ్యవస్థాపకుడు, సంస్థాపకుడు, సంచాలకుడు. తన క్షేత్రంలో నేర్పుగల కార్యకర్త. అతడు అబ్రహం లింకన్‌ను అవమానించవచ్చుగాక. కాని అతని గుణగణాలు, అతని యోగ్యత దేశశ్రేయస్సుకు ఉపయోగపడతాయి. వ్యక్తిగత ద్వేషం కారణంగా దేశకార్యం కొరకు పనికి వచ్చే ఒక కార్యకుశలుడైన వ్యక్తిని నేను పోగొట్టుకోలేను. అతనికి

దూరంగా వుండలేను. నాకు కావలసింది లింకన్ భక్తులు కాదు, దేశభక్తులు. అతడు స్వచ్ఛమయిన దేశభక్తుడని నా దృఢవిశ్వాసం.'

ఒక నిజమైన దేశభక్తుని ఈ మాటలు విని మిత్రులు ఏమీ జవాబు చెప్పలేకపోయినారు.

# నిజమైన వీరులు ఇలా ఉంటారు

సాయుధులైన రక్షణదళ సైనికులను చంపి వారి ఆయుధాలను లాగివైచుకొనే విద్రోహుల దురుద్దేశాన్ని నిష్ఫల మొనరించిన వ్యక్తి బూటారామ్. అతడు శౌర్యచక్ర బిరుదును పొందాడు. తనకు తుపాకీ గుండు తగిలినా కూడా లెక్కచేయకుండా విద్రోహులతో పోరాడిన కారణంగా అతనివల్ల చాలామంది నిరపరాధుల ప్రాణాలు రక్షింపబడ్డాయి.

13, మే , 1992 నాడు జరిగిన సంఘటన ఇది. రాత్రి 8-00 గం. ల సమయంలో బూటాసింగ్ తనతోటి సురక్షాదళ సైనికులతో కలిసి అమృతసర్‌లోని సుల్తాన్ బిందరొడ్డు లోవున్న తన ఇంటికి తిరిగి వెడుతున్నాడు. త్రోవలో విద్రోహులు పొంచి కూర్చున్నారు. వీరు సమీపించగానే విద్రోహులు ఎ.కె.47 రైఫిల్సుతో కాల్పులు ప్రారంభించారు. బూటారామ్ వెంటనే నేలమీదపడుకున్నాడు. దారినపోయే వారిని కూడా అలాగే పడుకొనవలసిందిగా చెప్పాడు. ఇంతలో తుపాకీ గుండ్లు బూటా రామ్ సహచరులలో ముగ్గురికి తగిలాయి. వారు గాయపడ్డారు. వారు తిరిగి కాల్పులు జరిపే స్థితిలో లేరు.

బూటారామ్ నెమ్మదిగా ప్రాకుకుంటూ విద్రోహులవైపు ముందుకు వెళ్ళాడు. విద్రోహులు అతనిపై కాల్పులు జరిపారు. బూటారామ్ భుజంలో ఒక తుపాకి గుండు దూసుకొని పోయింది. అయినప్పటికీ అతడు ముందుకు ప్రాకుతూనే వున్నాడు. దగ్గరకు వెళ్ళి విద్రోహులపై కాల్పులు ప్రారంభించాడు. ఇంత దగ్గరగా వచ్చి ఎదురుదాడి చేయడం చూసి విద్రోహులు గాబరా పడ్డారు. అంతకుముందే స్టార్ట్ చేసి వుంచిన రెండు స్కూటర్లపై ఎక్కి పలాయనం చిత్తగించారు. విద్రోహుల గుండ్లు దారిన బోయే ఇద్దరు వ్యక్తులకు తగిలాయి. ఒక స్త్రీ ఆసుపత్రిలో మరణించింది కూడా.

మృతుల సంఖ్య, గాయపడిన వారి సంఖ్య ఇంకా ఎక్కువ అయి ఉండేదే. కాని బూటాసింగ్ సాహసం కారణంగా విద్రోహులు పారిపోవలసి వచ్చింది. ఈ సంఘటన వివరాలు అమృతసర్‌లోని బి.డివిజన్ పోలీసు స్టేషనులో నమోదు చేయటం జరిగింది.

# శంఖుడు, లిఖితుడు

శంఖుడు, లిఖితుడు ఇరువురు గొప్ప ఋషీశ్వరులు. ఇరువురూ ఒక తల్లి బిడ్డలు. అస్తేయము ( ఒకరిసొమ్ము అపహరించకుండుట) అనే ధర్మాన్ని తు.చ. తప్పక పాటించారు. ఇరువురు ధర్మశాస్త్ర పారంగతులు. విద్యాభ్యాసము అయిన తరువాత ఇరువురు వివాహంచేసుకున్నారు. తమతమ ఆశ్రమాల్లో వేరువేరుగా జీవిస్తున్నారు. ఒకసారి లిఖితుడు తన అన్నగారైన శంఖుని కలుసుకునేందుకు ఆయన ఆశ్రమానికి వెళ్ళాడు. ఆశ్రమంలో ఆ సమయంలో

శంఖుడు లేడు. ఆయన భార్య కూడా లేరు. లిఖితునికి ఆకలివేసింది. అతడు అన్నగారి తోటలోకి వెళ్ళి ఒక పండుకోసుకొని తిన్నాడు. కొంచెంసేపటికి శంఖుడు వచ్చాడు. లిఖితుడు అన్నగారికి ప్రణామం చేశాడు.

శంఖుడు తన తమ్ముణ్ణి సాదరంగా ఆహ్వానించాడు. కుశల ప్రశ్నలు అయినాయి. పిమ్మట తమ్ముడిని ఆహారాన్ని స్వీకరించమని కోరాడు. తాను స్వయంగా ఒక పండుకోసుకొని తిన్నానని లిఖితుడు చెప్పాడు. శంఖుడు ఇలా అన్నాడు, 'సోదరా! నీవు ఇక్కడికి వచ్చావు. నేను లేకపోయినా ఈ తోటను నీదిగా భావించి ఒక పండు తీసుకున్నావు. నాకు సంతోషమే. కాని బ్రాహ్మణులమైన మనకు ధర్మమే సర్వస్వము. నీకు ధర్మం యొక్క తత్త్వం తెలుసు. ఎవరి వస్తువులైనా వారి అనుమతి లేకుండా వారు లేనప్పుడు తీసుకుంటే దానిని ఏమంటారు?'

'దొంగతనం,' లిఖితుడు నిస్సంకోచంగా సమాధానం చెప్పాడు, 'పొరపాటున నా ద్వారా ఈ అకార్యంజరిగింది. ఇప్పుడు ఏమిచేయటం మంచిది?'

'రాజ సన్నిధికి వెళ్ళి దీనికి శిక్ష అనుభవించు. దీనితో ఈ దోషం నివారించబడుతుంది' శంఖుడు చెప్పాడు.

లిఖితుడు రాజధానికి వెళ్ళాడు. రాజు ఆయనకు ప్రమాణంచేసి అర్ఘ్య పాద్యాలు సమర్పించ బోయాడు. అప్పుడు లిఖితుడు ఇలా అన్నాడు 'రాజన్, నాకు పూజార్హతలేదు. నేను అపరాధం చేశాను. దండింపదగినవాణ్ణి.' అపరాధం యొక్క వివరాలు విని రాజు ఇలా అన్నాడు, 'రాజుకు దండించే అధికారం

ఉన్నట్లుగానే క్షమించే అధికారం కూడా ఉందికదా!'

లిఖితుడు ఇలా అన్నాడు, 'నీ పని ఏ నేరానికి ఏ శిక్ష వేయాలో నిర్ణయించటంకాదు. అది బ్రాహ్మణులు చేయవలసినపని. నీవు కేవలం ఆ విధానాన్ని అమలు పరచవలసినవాడవు. నాకు దండన విధించాలి. నీవు దండన అమలుపరచు.'

ఆనాటి దండన విధానం ప్రకారం దొంగతనం చేసిన వారికి రెండు చేతులు ఖండించాలి. రాజుగారు లిఖితుని రెండుచేతులను మణికట్టు వరకు ఖండింపచేశారు. తెగిన చేతులతో ప్రసన్నమైన ముఖంతో లిఖితుడు అన్నగారి వద్దకు వచ్చి, 'అన్నా శిక్ష స్వీకరించి వచ్చాను. శంఖుడు చెప్పాడు, మధ్యాహ్న సంధ్యాసమయమైనది స్నాన సంధ్యాదులు ముగించుకొని వద్దాము.'

లిఖితుడు అన్నగారితో సరస్సుకు స్నానానికి వెళ్ళాడు. అలవాటుకొద్దీ తనకు తెలీకుండానే అర్ఘ్యం ఇచ్చేందుకు నీటిని దోసిలితో తీసుకోవటానికి చేతులు ముందుకు జాపాడు. ఆశ్చర్యంగా చేతులు రెండూ వచ్చాయి. అతడు అన్నగారి వైపు చూచి ఇలా అన్నాడు,

'అన్నా, మీరు ఇదే చేయదలచుకుంటే నన్ను రాజధానివరకు ఎందుకు పరిగెత్తించారు?'

శంఖుడు ఇలా చెప్పాడు. 'నేరం చేసిన వారికి దండన విధించవలసిన వాడు రాజుమాత్రమే. కాని బ్రాహ్మణునికి క్షమించే అధికారం వుంది.'

# సత్యవ్రతం

'నారాయణ!నారాయణ! అని ఉచ్చరిస్తుంటావు. ఎవరీ నారాయణుడు? ఎక్కడ ఉంటాడు? అతని గుణాలు ఏమిటి? ఏమి చేయగలడు వాడు? ' దైత్యరాజు తన పుత్రుణ్ణి అడిగాడు.

'తండ్రీ, నారాయణుడంటే ఈశ్వరుడు, సృష్టికర్త, సర్వశక్తిమంతుడు'.

'చాలించు నీ ప్రలాపం' తండ్రికి కోపం వచ్చింది.

'లేదుతండ్రీ! ఇది సత్యం. ఆయన సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు'.

'నేనే సర్వశక్తిమంతుణ్ణి. మూర్ఖుడా! నేనే ఈశ్వరుణ్ణి. నారాయణ, నారాయణ అనే జపం మాని ఇకనుండి నీవు నానామాన్ని జపించాలి. తెలిసిందా?'

'లేదు. మీరు నాకు తండ్రిలా పూజ్యులు. కాని నేను మీ నామాన్ని జపించలేను. మిమ్మల్ని తండ్రిగా గౌరవించగలను'.

రాజైన హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి కష్టాలకు లోనుచేసి చంపవలసిందిగా మంత్రిగారికి ఆదేశించాడు. ప్రహ్లాదుణ్ణి సముద్రంలో ముంచారు. కొండపైనుండి క్రిందకు త్రోశారు. కాని ప్రహ్లాదునికి ఏమీ కాలేదు. హోలికాదేవి అతనిని తీసుకుని అగ్నిలో కూర్చుంది. ఆమె భస్మం అయింది కాని ప్రహ్లాదుడు క్షేమంగా ఉన్నాడు. చివరికి మళ్ళీ ప్రహ్లాదునికి నచ్చచెప్పాలని ప్రయత్నించారు. కాని అతను అంగీకరించలేదు. అతని నోటినుండి కేవలం 'నారాయణ! నారాయణ!' అనే మాటలు మాత్రమే వస్తున్నాయి. అప్పుడు అగ్నిలో ఎర్రగా

కాల్చిన ఇనుపస్తంబానికి అతనిని కట్టివేశారు.

ప్రహ్లాదుణ్ణి స్తంభానికి బంధించగానే అందులోనుండి నృసింహస్వామి ప్రత్యక్షమైనాడు. ఆయన ప్రహ్లాదుని తండ్రియైన హిరణ్యకశిపుని వధించాడు. భక్తుడైన ప్రహ్లాదుణ్ణి ఆశీర్వదించి వరం ఇచ్చాడు, 'నీవు తేజశ్శాలివి అవుతావు, మహాత్ముడివి అవుతావు, విద్వాంసుడవు అవుతావు'. ఇలా చెప్పి ఆయన అంతర్ధానమైనాడు. ప్రహ్లాదుడు ధన్యుడు. అతని హరిభక్తి ధన్యం.

# పైలట్ అయిన వికలాంగుడు

ప్రకృతి అతని వికాసానికి అడ్డుపడింది. ఆ బాలుడు వికలాంగునిగా పుట్టాడు. కాని అతనికి స్వాభిమానం ఉంది. పురుషార్థంపై విశ్వాసం ఉంది. ఒకనాడు ఒక సజ్జనుడు అతనిని చూచాడు. అతనికి దయకలిగింది. ఒక డాలరు నాణెం వికలాంగుడైన బాలుని చేతిలో పెట్టాడు. ఆ నాణెంను తిరిగి ఇచ్చివేస్తూ బాలుడు దృఢవిశ్వాసంతో ఇలా చెప్పాడు, 'అయ్యా నేను బిచ్చమెత్తుకోను. నాకు సహాయపడాలని మీ కుంటే నన్ను ఏదైనా స్కూల్లో చేర్పించండి. నేను చదువుకుంటాను' అతని జవాబువిని సంతోషించి ఆ వ్యక్తి బాలుణ్ణి బడిలో చేర్పించాడు. తన ప్రతిభ, స్వాభిమానం, స్వావలంబన కారణంగా రెండుకాళ్ళు లేని ఆ కుంటిబాలుడు ఆ తరువాత నిపుణుడైన పైలట్ అయి మంచిపేరు తెచ్చుకున్నాడు. అతని పేరు ఏమిటో తెలుసా? పైలట్ శాంటర్స్.

# ఆత్మ సంయమ సాధన

ఆర్య సమాజస్థాపకులైన స్వామి దయానంద షాహాపూర్‌లో నివసిస్తుండేవాడు. వారు నివసిస్తున్న చోటికి దగ్గరే నూతనంగా ఒక భవనం నిర్మాణంలో వుంది. అకస్మాత్తుగా కడుతున్న భవనం యొక్క కప్పు విరిగి పడిపోయింది. పనిచేస్తున్న కార్మికులు దానిక్రింద చిక్కుకొని పోయారు. రక్షించండి, రక్షించండి అనే కేకలు వినవచ్చాయి. జనం గుంపుగా చేరారు. కాని ఎవరూ ఆ శిథిలాలలోకి వెళ్ళి చనిపోతున్నవారిని రక్షించి బయటకు తీసుకుని వచ్చే సాహసం చేయలేకపోయారు.

స్వామీజీ కూడా కేకలు విన్నారు. వెంటనే వారు ఆ స్థలానికి వెళ్ళారు. పరిస్థితిని గమనించారు. ఏమి చెయ్యటానికి దిక్కుతోచక నిలుచున్న గుంపులో నుండి ముందుకు వచ్చి తన భుజబలంతో అక్కడవున్న ఒక పెద్ద రాతిబండను తొలగించారు. అక్కడ నుండి శిథిలాలలో చిక్కుకున్న కార్మికులు బయటికి వచ్చారు.

స్వామి దయానందది బలిష్టమైన శరీరం. ఆయన చేసిన సాహసకృత్యం చూచి అంతా జయజయకారాలు చేశారు. స్వామీజీ అందరినీ శాంతింపజేసి వివరించారు.

'ఈ శక్తి ఏదో చమత్కారం కాదు. అలౌకికమైన ప్రదర్శన కాదు. ఆత్మ సంయమ సాధన చేసే ప్రతివ్యక్తి ఇంతకంటే గొప్పశక్తులు సిద్ధులు సంపాదించవచ్చును'.

# ధర్మనిష్ఠ - హంసరాజు

ఆంగ్లేయుల పరిపాలనలో లాహోర్‌లోని మిషన్ హైస్కూల్లో 9వ తరగతి అది. ఒక ఆంగ్లేయ ఉపాధ్యాయుడు పాఠం చెబుతున్నాడు. మధ్యలో హిందూ ధర్మాన్ని, సంస్కృతిని నిశితంగా విమర్శిస్తున్నాడు. అపహాస్యం చేస్తున్నాడు. ఒక విద్యార్థి దీన్ని సహించలేకపోయాడు. వెంటనే అతను తన స్థానంలో లేచి నిలుచున్నాడు. ఎంతో వినయ పూర్వకంగా తర్కయుతంగా వివేకంతో ఉపాధ్యాయునికి సమాధానం చెప్పాడు. ఆయన చెప్పింది సక్రమంగాలేదని విమర్శించాడు. ఈ సందర్భంగా క్రైస్తవ మతంలోని అసంగతమైన అంశాలను కూడా పేర్కొన్నాడు. ఆంగ్లేయ ఉపాధ్యాయునికి బాగా కోపం వచ్చింది. ఆ బాలుని దండించాడు. తాను చేసింది తప్పు అని ఒప్పుకోవలసిందిగా వత్తిడి చేశాడు. దృఢ సంకల్పం, ధర్మనిష్ఠ కలిగిన ఆ విద్యార్థి అన్యాయానికి ఎదుట తలవంచలేదు. అన్యాయాన్ని అంగీకరించలేదు. ఈ బాలుడే తరువాత కాలంలో మహాత్మా హంసరాజ్ పేర ప్రసిద్ధుడైనాడు. ఈయన ఆ జన్మాంతం హిందూధర్మ ప్రచారం చేసాడు. పంజాబు ప్రాంతం అంతటిలో అనేక విద్యాలయాలు, మహావిద్యాలయాలు స్థాపించాడు.

# సేవా కార్యము, సహనము

ఇంగ్లాండులోని ఒక విదుషీమణి స్వామి వివేకానందుని పిలుపుపై భారతదేశానికి వచ్చింది. ఇక్కడ సేవా కార్యక్రమాలకు తన జీవితాన్ని సమర్పించింది. ఇంగ్లాండులో ఉండగా ఆమె ఒక ఉపాధ్యాయునిగా ఉండేది. ఒక శిక్షాసమితిలో సభ్యురాలుగా ఉండేది. ఆమె మొదటిపేరు మార్గరేట్ నోబుల్. స్వామీజీ ఆమెకు భగినీ నివేదిత అనే నూతన నామం ప్రదానం చేశారు.

బెంగాల్‌లో స్త్రీ విద్య వ్యాప్తికై నియోగించారు. నివేదిత అనాథ బాలలకొరకు అనాథాశ్రమాన్ని ప్రారంభించింది. ఆమె బ్రిటిష్ ప్రభుత్వం నుండి ఏరకమైన సహాయంను స్వీకరించరాదని నిర్ణయించుకొంది. స్వదేశీయులనుండి మాత్రమే ధన సహాయాన్ని తీసుకుని ఆమె ఆశ్రమాన్ని నిర్వహించింది. ఒకసారి ధనసహాయం కోసం ఆమె ఒక ధనవంతుని ఇంటికి వెళ్ళింది. అనాథ బాలికల పోషణ నిమిత్తం సహాయాన్ని అర్థించింది. ఆయన సహాయం చేయటానికి నిరాకరించాడు. ఆమెను వెళ్ళమని చెప్పాడు. కాని నివేదిత బీద బాలికలకు సహాయం చేయండి అంటూ ఆ వ్యక్తిని మళ్ళీ కోరింది. ఆ మహాశయునికి క్రోధం మిన్నుముట్టింది. వివేకం కోల్పోయి అతను భగినీ నివేదితను కొట్టాడు. నివేదిత కొంచెంసేపు మౌనంగా నిల్చుంది. తరువాత ఆయనను ప్రార్థించింది, 'అయ్యా, తమరు క్రోధంలో నన్ను కొట్టారు. చాలా సంతోషం. కాని ఈ అనాథ బాలికల కోసం ఏదైనా ఇవ్వండి'. ఆ వ్యక్తి నీరు కారిపోయాడు. సేవా కార్యక్రమాలు నిర్వహించేటప్పుడు ఎంతటి నిష్ఠ వుండాలి? లక్ష్యసాధనకై ఎంతటి సమర్థన భావన ఉండాలి? ఈ విషయం పై సంఘటన వల్ల స్పష్టమౌతుంది.

# అమర ఫలాలు

ఒక పర్యాయం ఒక తండ్రి తన కుమారునికి డబ్బులు ఇచ్చి పండ్లు కొని తెమ్మని బజారుకు పంపాడు. కుమారుడు త్రోవలో కొందరు వ్యక్తులను చూచాడు. వారి ఒంటిపై చిరిగిన వస్త్రాలు కూడా పూర్తిగా లేవు. వారి ఆకలితో అల్లాడుతున్నారు. ఆ బాలుడు పండ్లు తెమ్మని ఇచ్చిన డబ్బులు క్షుధార్తులకు ఇచ్చివేశాడు. వారు ఆహార పదార్థాలు కొనుక్కొని తిని తమ ఆకలి

తీర్చుకున్నారు. తాను చేసిన పనివల్ల ఆ బాలునికి ఎంతో సంతోషం కలిగింది. ఒక దివ్యమైన అనుభూతి కలిగింది. అతను ఇంటికి తిరిగి వచ్చాడు.

తండ్రి అడిగాడు, 'ఖాళీ చేతులతో వచ్చావేమి? పండ్లు తేలేదా?'

'తండ్రీ క్షమించండి. పండ్లు తేలేక పోయాను. ఐతే అమరమైన ఫలములు తెచ్చాను'. బాలుడు వినయంగా జవాబు చెప్పాడు.

'ఏమిటి? నీ మాటలకు అర్థం ఏమిటి? ఎక్కడ ఉన్నాయి ఆ అమరఫలాలు? ఏదీ నన్ను చూడనీ?' తండ్రి గొంతులో కొద్దిగా అసంతృప్తి కనిపించింది.

'తండ్రీ త్రోవలో నేను అన్నార్తులైన దీనజనులను చూచాను. వారి కష్టం చూడలేకపోయాను. డబ్బులన్నీ వారికి ఇచ్చివేశాను. వారికి ఈ రోజున ఆకలి తీరుతుందికదా. మన పండ్లు తిన్నందువల్ల తాత్కాలికమైన ఆనందం కలుగుతుంది. కాని ఈ అమర ఫలాల వల్ల అనిర్వచనీయమైన ఆనందం లభిస్తుంది. తండ్రీ! ఈ ఫలాలు శాశ్వాతమైనవి. మామూలు ఫలాలు నశించిపోతాయి'. బాలుని నేత్రాలలో ఏదో కాంతి కనిపించింది. అతను మాట్లడుతూనే ఉన్నాడు. తండ్రి కూడా జ్ఞాని. పుత్రుని మాటలు విని సంతోషించాడు. ఈ బాలుడే పెద్దవాడై సంత్ రంగదాస్ అనేపేరుతో కీర్తి గావించాడు.

# రేణుకాదేవి సేవావ్రతం

రేణుక జమదగ్ని మహర్షి భార్య. ఆశ్రమ విద్యార్థుల బాగోగులు చూస్తుండేది ఆమె. విద్యార్థులలో ఎవరైనా అస్వస్థతతో ఉంటే వారికి రాత్రింబవళ్లు మాతృభావంతో సేవ చేసేది. వారి ప్రక్కనే కూర్చుని ఉండేది.

విద్యార్థులు ఆమెను ఎంతో గౌరవభావంతో చూసేవారు. ఆమెను ప్రేమతో 'అంబ' అని పిలిచేవారు.

ఒకసారి జమదగ్ని ఆశ్రమానికి గంధర్వరాజు వచ్చాడు. ఆయన రేణుకతో తన నగరంలోని దుఃస్థితి వివరించాడు. 'అక్కడ కుష్ఠురోగం వ్యాపించింది. కుష్ఠురోగి లేని ఇల్లేలేదు. నన్ను ఈ ఆపదనుండి గట్టెక్కించండి. ఏదైనా ఉపాయం ఆలోచించండి. మీరు నాతోవస్తే బాగుంటుందేమో ఆలోచించండి' అని ఆ రాజు విన్నవించాడు. మహర్షి ఆశ్రమంలో లేడు. రేణుకా దేవి ఆలోచనలో పడిపోయింది. కొంచెం ఆలోచించుకొని ఆమె చెప్పింది 'మంచిది పదండి. నేనూ మీతో వస్తున్నాను. అక్కడ కుష్ఠురోగుల సేవ చేస్తాను'. రేణుకాదేవి ఆ నగరంలోకి వెళ్ళటంతోటే రోగులకు సేవ చేయటం మొదలుపెట్టింది. ఆమె వారి గాయాలను శుభ్రం చేసేది. మూలికలతో తయారుచేసిన మందులు ఆ గాయాలకు పూసేది. అన్నం తినిపించేది. నీరు త్రాగించేది. ఆమెను చూడగానే కుష్ఠురోగులు కూడా 'అంబ' అని పిలవసాగారు. రేణుకాదేవికి నడుమ నడుమ ఆలోచన వచ్చేది. తాను మహర్షి అనుమతిలేకుండా వచ్చేసింది. మహర్షి ఇప్పుడు తనను క్షమించరు. ఆమెలో అంతర్మథనం మొదలయింది. చివరకు ఆమె రోగులకు సేవచేస్తూనే ఉండిపోవాలని సంకల్పించుకొంది. జమదగ్నికి అంతా తెలిసిపోయింది. ఆమెను తీసుకొని రావలసిందని తనపుత్రుడైన పరశురాముణ్ణి పంపాడు. పరశురాముడు వెళ్ళి చూచాడు. తల్లి కుష్ఠురోగులకు సేవచేస్తోంది. ఆత్మీయతతో, వాత్సల్యభావంతో ఆమె వారికి ఉపశమనం కలిగిస్తోంది. పరశురాముడు పులకించిపోయాడు. తల్లిని తీసుకుని వెళ్ళేందుకు సాహసించలేకపోయాడు. తిరిగివెళ్ళి తండ్రికి చెప్పాడు. 'నా తల్లి అక్కడ సేవాకార్యక్రమంలో నిమగ్నమై ఉంది'. కొంతకాలం అయిన తరువాత రేణుక ఆశ్రమానికి తిరిగి వచ్చింది. జమదగ్ని ఆమె సేవాకార్యాన్ని మిక్కిలి ప్రశంసించాడు. హిమాలయాల్లో రేణుకాతీర్థం ఈమె

స్మృతి చిహ్నంగా ఇప్పుడూ నిల్చి ఉంది. వేలాది యాత్రికులు ప్రతియేడాది ఈ తీర్థాన్ని సేవించి ధన్యులౌతుంటారు. పరోపకారాన్ని మించిన ధర్మం లేదు. రేణుకాదేవి ఈ ధర్మాన్ని పాలించింది.

# శబ్దము - అర్థము - భావము

తుకారాం వినయంగా సౌమ్యంగా గురువు ఎదుట కూర్చున్నాడు. ప్రణామం చేసి అడిగాడు. 'గురువర్యా, దక్షిణగా ఏమివ్వమంటారు?' 'ఒక పావునేయి' గురువు క్లుప్తంగా సమాధానం చెప్పాడు. తుకారాం సందిగ్ధంలో పడ్డాడు. ఆలోచిస్తున్నాడు. గురువుగారు నేయి అడిగారు. అంటే పావునేయి యిచ్చి సంతృప్తి పడాలా? లేక ఆ మాటకు ఏదైనా లోతైన అర్థం వుందా? తుకారాం లోలోపల మననం చేసుకుంటున్నాడు. గురువు చిరునవ్వు నవ్వుతున్నాడు. తుకారం ఆలోచించిన మీదట అర్థం తెలిసింది. గురువు తనను అహంకారాన్ని దక్షిణగా అడుగుతున్నాడు.

ఒక పావు నెయ్యి ఏమిటి, తన అహంకారమంతటినీ, తన సర్వస్వాన్నీ, గురువు కర్పించేందుకు తుకారాం నిశ్చయం చేసుకున్నాడు. నిరహంకార స్వభావం కల ఈవ్యక్తి తరువాత కాలంలో భక్త తుకారాంగా ప్రసిద్ధి చెందాడు. శబ్దం యొక్క అర్థాన్ని గ్రహించి ఆ అర్థానికి అనుగుణంగా జీవించగలిగిన వ్యక్తి ధన్యుడు. అందుకే తుకారాం సమర్పించిన గురుదక్షిణ సఫలమైంది.

# కృతజ్ఞతాభావం

మహాపురుషులు కూడా మొట్టమొదట విద్యాభ్యాసం నిమిత్తం ఎన్నో కష్టాలను ఎదుర్కొన వలసి వస్తుంది. వారిలో గోపాలకృష్ణ గోఖలే ఒకడు. ఆయన తర్వాత కాలంలో గాంధీజీకి రాజకీయ గురువు. గోఖలేది ప్రేరణాదాయకమైన

వ్యక్తిత్వం. ఆయన బాల్యం దుర్భర దారిద్ర్యంలో గడచింది. ఆయనకు ఎప్పుడూ ఏకాదశీవ్రతమే. హైస్కూలు విద్య పూర్తిఅయింది. కాలేజీలో చేరటం ఎలాగా అనేది ప్రశ్న అయింది. ఏమిచెయ్యాలి? ఎలా చెయ్యాలి? కుటుంబ సభ్యులంతా ఆలోచనలో పడ్డారు. ఖర్చుతో కూడిన విషయం కదా?

గోపాల గోఖలే అన్నగారైన గోవింద రావుగోఖలే ఈ బాధ్యత తనమీద వేసుకున్నారు. అన్నగారి భార్య తన నగలమ్మి మరిది చదువునిమిత్తం ప్రవేశ రుసుము చెల్లించింది. కొల్హాపూర్‌లో రాజారామ్‌కాలేజీలో ప్రవేశం లభించింది.

అన్నగారైన గోవిందరావు జీతం రూ 25లు. అందులో 7 రూపాయలు ప్రతినెల గోపాల్ కు ఖర్చుల నిమిత్తం పంపేవాడు. గోపాల్‌కు పరిస్థితి అంతా తెలుసు. అందువల్ల మితంగా ఖర్చు పెట్టేవాడు. శ్రద్ధగా కష్టపడి చదువుకునేవాడు. ఆయన బి.ఎ. పాసైనాడు. బి.ఎ. పాస్ కాగానే ఉపాధ్యాయుని ఉద్యోగం వచ్చింది. జీతం నెలకు 35 రూ.లు. ఇందులో కొంత అన్నగారికి పంపేవాడు. ఐతే డబ్బు తిరిగి ఇచ్చినంత మాత్రాన అన్న, వదినెల ఋణాన్ని ఆయన తీర్చుకోగలడా? అసంభవం.

ఆ దంపతుల త్యాగనిరతి, పరోపకారబుద్ధి, స్నేహశీలం కుటుంబ సభ్యులకు ఒక అద్వితీయమైన ఉదాహరణగా నిలిచాయి. గోపాల కృష్ణ గోఖలే ఆజన్మాంతం వారిపట్ల కృతజ్ఞతా భావంతో ఉండేవాడు.

గోపాలకృష్ణ గోఖలే ఆయన కుటుంబసభ్యులు ఎంతటి ఆదర్శప్రాయులు!

# పని చేయటానికే చేతులు

జార్జి వాషింగ్టన్‌కు ప్రతిరోజు ఉదయం సాయంత్రం వ్యాహ్యాళికి వెళ్ళటం అలవాటు. వ్యాహ్యాళికి వెళ్ళినప్పుడు సాధారణ వేషంలో ఒంటరిగా వెళ్ళటం ఆయనకిష్టం. మందీ మార్బలంతో వెళ్ళటానికి ఆయన ఇష్టపడేవాడుకాదు. ఇందువల్ల చాలామంది ఆయనను గుర్తుపట్టేవారు కాదు. ఒక రోజున కొందరు కార్మికులు ఒకపెద్ద కొయ్యదూలాన్ని ఇంటిపైకి ఎక్కించటానికి ప్రయత్నిస్తున్నారు. కాని వారి ప్రయత్నాలు సఫలం కావటంలేదు. వారికి ఇంకొక్క మనిషి తోడైతే ఆ దూలం పైకిపోతుంది. వాషింగ్టన్ ఇది గమనించాడు.

కార్మికుల చేత పనిచేయిస్తున్న మేస్త్రీ అక్కడ ఉన్నాడు. అతడు నిల్చొని వారిపై జులుం చేస్తున్నాడు. అరుస్తున్నాడు. ఇంకా గట్టిగా ప్రయత్నించండి అంటూ హెచ్చరిస్తున్నాడు - రాష్ట్రపతి ఐన వాషింగ్టన్ చూసి ఆ మేస్త్రీతో అన్నాడు, 'మీరు కూడా చేయూత ఇవ్వవచ్చుకదా!'

ఆ మేస్త్రీకి ఆవేశం వచ్చింది 'కార్మికుల చేత పని చేయించటమే నాపని. నేను స్వయంగా పనిచేయను'. 'మంచిది అదా సంగతి!' అని చెప్పితాను వెళ్ళి శక్తినంతా కూడ గట్టుకొని రెండుచేతులతో తాను కూడా సహాయం చేశాడు. ఆ దూలం సులభంగా పైకి చేరింది. అప్పుడు రాష్ట్రపతి ఇలా అన్నాడు, 'మేస్త్రీగారు, నమస్కారం. మళ్ళీ ఎప్పుడైనా ఇటువంటి అవసరం వస్తే పిలిపించండి వస్తాను. నా పేరు జార్జివాషింగ్టన్.'

ఇది వినగానే మేస్త్రీకి పై ప్రాణాలు పైనే పోయాయి. రాష్ట్రపతిని

క్షమించమని వేడుకున్నాడు. రాష్ట్రపతి ఒక షరతుపై అతనిని క్షమించివదలిపెట్టాడు. భవిష్యత్‌లో అతను కార్మికులకు పనిలో చేయూత నివ్వాలి. ఇలా చెప్పి రాష్ట్రపతి వెళ్ళిపోయినాడు. తాను చేసిన ఈ పనిద్వారా ఆ మహాపురుషుడు ఒక గొప్ప పాఠం నేర్పాడు.

# వీరుడంటే ఎవరు?

ఢిల్లీలోని రామకృష్ణపురం నివాసి నరేంద్రసింహ పవార్. హిందీ సినిమా నటుల అభిమాని. అతడు సినిమా నటుల మాదిరిగా నృత్యం చేసేవాడు. అంతేకాకుండా సినిమా తెరపై ప్రదర్శించబడే సాహస, పరాక్రమాలవల్ల ప్రభావితుడైనాడు. అలాంటి సాహసమే ఒకసారి అతడు కూడా ప్రదర్శించాడు. **23** మే **1994** నాడు ఇది జరిగింది.

సాయంత్రం షుమారు **4** గంటలయింది. అతడు ఒక స్త్రీ ఆర్తనాదాన్ని విన్నాడు. ఆ స్త్రీ సహాయం చేయమని కేకలుపెడుతోంది. నరంద్రసింహ పవార్‌కు ఆమె భాష అర్థం కావటం లేదు కాని కేకలను బట్టి ఆమె సహాయం కోసం అరుస్తోందని అర్థమైంది. ఆ సమయంలో శ్రీపవార్ తన ఫ్లాట్‌లో ఉన్నాడు. ఆ స్త్రీ కేక క్రింది అంతస్థులోని ఫ్లాటునుండి వచ్చింది. నరేంద్ర సింహ వేగంగా క్రింది ఫ్లాటుకు వెళ్ళాడు. ఫ్లాటులోనుండి, పొగ దట్టంగా వస్తోంది. అతడు తన ప్రాణాలకు తెగించి ఆఫ్లాటులోకి చొచ్చుకొని పోయాడు. జేబుగుడ్డను ముక్కుకు గాస్‌మాస్క్‌లాగా కట్టుకున్నాడు. ఒక్క క్షణం ఆలస్యం చేయకుండా కిటికీ చువ్వలు విరగగొట్టి పొగ వస్తున్న గదిలోకి వెళ్ళాడు. తరువాత కరెంటు మెయిన్ స్విచ్ ఆపేశాడు. టివి. మంచం, ప్రక్క బట్టలు మొదలైన

వస్తువులు బయటపడేశాడు. సామాను ఖాళీచేసి లోపలికి వెళ్ళగా కూలర్ అతని మీదపడింది. బాధ కలిగింది. అప్పుడే ఆ గదిలో స్పృహ తప్పి పడివున్న ఒక పిల్లవాణ్ణి అతడు చూచాడు. వెంటనే ఆ పిల్లవాణ్ణి బయటకు లాగి, బయట నిల్చునివున్న ఇరుగు పొరుగువారికి అందించాడు. అతను మళ్ళీ లోనికి వెళ్ళి చూశాడు. షార్ట్ సర్క్యూట్ వల్ల కరెంటు తీగలకు నిప్పు అంటుకుంది. అతడు ఆ మంటను ఆర్పేశాడు. నరేంద్రసింహ సమయానికి వచ్చి రక్షించకపోయినట్లైతే ఎన్నో అంతస్థులుగల ఆ భవనం అగ్నిలో ఆహుతై ఉండేది. నరేంద్ర సింహను ఈ సాహసకృత్యాన్ని గురించి అడిగితే ఆయన దానిని స్మృతికి తెచ్చుకుంటూ ఇలా చెబుతాడు, 'ఆపద సంభవించినప్పుడు మనిషి ఒక్కొక్క సమయంలో అద్భుతమైన శక్తిని ప్రదర్శిస్తాడు. దీనికి మనం పరాక్రమం అని పేరు పెడతాం'.

# పరిశ్రమకు ఫలితం

హెన్రీ ఫోర్డు అమెరికాలో ఒక చిన్న గ్రామమైన గ్రీన్‌లో జన్మించాడు. ఇంట్లో ఆర్థిక పరిస్థితి అధ్వాన్నంగా ఉంది. పేదరికం వేరు, అకర్మణ్యత వేరు. ఈ రెండింటికీ సంబంధం ఉండకూడదు. ఈ సత్యాన్ని ఫోర్డు తన 12వ ఏటనే గ్రహించాడు. బాల్యంలోనే దారిద్ర్యంతో పోరాడుతూ ఆ బాధ నుండి విముక్తి పొందాలని అతను నిశ్చయం చేసుకున్నాడు.

ఫోర్డు ఉద్యోగంలో చేరాడు. రాత్రిపూట చదువుకునేవాడు. మిషన్‌లు తయారుచేయటం, రిపేర్ చేయటం - ఎప్పుడూ అతని మస్తిష్కంలో ఇవే మెదలుతూ ఉండేవి. పట్టుదల వల్ల, పరిశ్రమ వల్ల హెన్రీ ఒక మెకానిక్

అయినాడు. తన కాళ్ళమీద తాను నిలబడగలిగాడు.

ఫోర్డు మోటార్లను తయారుచేసే పనిని చేపట్టాడు. ఇందులో ఎంతో నైపుణ్యాన్ని సంపాదించాడు. ప్రగతి పథంలో ముందుకు సాగిపోతూ అతడు తిరిగి వెనుకకు చూడలేదు. ఈనాడు అమెరికాలో అతని ఫ్యాక్టరీ ప్రథమ స్థానంలో వుంది. ఇది అందరికీ తెలిసిన విషయమే. ఆ ఫ్యాక్టరీలో 50,000 మంది కార్మికులు పనిచేస్తున్నారు. అక్కడ నిమిషానికి ఒక మోటారుకారు తయారు అవుతుంది.

ధనం ఇంతగా సంపాదించినా ఫోర్డుకు గర్వం పెరగలేదు. ఫోర్డు ఫౌండేషన్ ద్వారా కోటానుకోట్ల డాలర్లు దానం చేయబడ్డాయి. జన సంక్షేమ కార్యక్రమాలలో ఆ సంస్థ చేసే ఆర్థిక సహాయం ఆయనకు యెల్లప్పుడు తన వెనుకటి దారిద్ర్యాన్ని స్మృతికి తెస్తూ వుంటుంది.

సజ్జనులైన వారు వృక్షాలమాదిరిగా వుంటారు. చెట్లు కాయలు కాస్తే వాటి కొమ్మలు క్రిందికి వంగుతాయి. ఫోర్డు కూడా అంతే?

# ఏకాగ్రత వల్ల ధ్యేయ సిద్ధి

భారతదేశానికి స్వాతంత్ర్యం రాక పూర్వం సుమారు 50-55 సం. క్రిందట జరిగిన సంఘటన ఇది. అమెరికాలో ధనిక కుటుంబాలకు చెందిన బాలురు కొందరు ఒక నది ఒడ్డున తుపాకి గురి పెట్టడం నేర్చుకుంటున్నారు. ఒక చోట ఒక బెలూన్ కట్టారు. దూరం నుండి తుపాకి పేల్చి దాన్ని పగులకొట్టాలి. ఇలా వారు ప్రయత్నిస్తున్నారు. కాని ఎన్నిసార్లు పేల్చినా లక్ష్యాన్ని కొట్టలేక పోతున్నారు. ఆ బాలురు ఒకరి తరువాత ఒకరు వస్తున్నారు. గురి పెడుతున్నారు. కాని మధ్యలో వారి దృష్టి చెదరిపోతోంది. ఈ బాలురు

చేస్తున్నదంతా ఒక వ్యక్తి జాగ్రత్తగా గమనిస్తున్నాడు. కొంచెంసేపు అయిన తర్వాత ఆ వ్యక్తి ఈ బాలుర దగ్గరకి వచ్చాడు. ఆయన పైనుండి క్రింది వరకు కాషాయ వస్త్రాలు ధరించి వున్నాడు. శిరస్సుపైన కాషాయపురంగు గల తలపాగా వుంది. ఆయన ముఖమండలంపై తేజస్సు కొట్టవచ్చినట్లు కన్పిస్తోంది. ఆ వ్యక్తి తాను గురిపెడతాను అని తుపాకి అడిగాడు. ఆ బాలురకు ఆశ్చర్యం వేసింది. తుపాకి ముఖం ఎరుగని ఈ సన్యాసి గురి పెట్టగలడా? కాని ఆయన ఒకే ఒకసారి పేల్చి బెలూన్‌ను పగల కొట్టి తన లక్ష్యశుద్ధిని ప్రదర్శించాడు.

ఆ బాలురి మనసులలో రకరకాల ప్రశ్నలు తలెత్తాయి. ఏమాత్రం అభ్యాసం లేకుండానే ఆ సన్యాసికి విజయం ఎలా లభించింది? మాటిమాటికీ అభ్యాసం చేస్తున్నా తమకెందుకు లక్ష్యసిద్ధి కలుగలేదు. ఆ సన్యాసి ఈ ప్రశ్నలన్నింటికీ ఒకే సమాధానం చెప్పాడు, 'మనస్సు ఏకాగ్రమైతే లక్ష్యం సిద్ధిస్తుంది'. ఆ సన్యాసి ఇలా ఆ బాలురకు వివరించాడు 'ఏకాగ్ర చిత్తం కఠినాతి కఠినమైన లక్ష్యాన్ని కూడా సాధిస్తుంది'. సన్యాసిపేరు స్వామి వివేకానందుడు. భారతీయ ధర్మానికి, సంస్కృతికి విదేశాలలో గౌరవస్థానాన్ని కల్పించి ప్రచారం చేసిన మహాపురుషుడు.

# జాతీయ సంపదపట్ల దృష్టి

స్వర్గీయ పండిత దీనదయాళ్ ఉపాధ్యాయ రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ కార్యకర్తలతో కలిసి బొంబాయి నుండి నాగపూర్ రైల్లో మూడవ తరగతిలో ప్రయాణం చేస్తున్నారు. ఆ రోజులలో వారు భారతీయ జనసంఘానికి ప్రధాన కార్యదర్శి. అదే బండిలో మొదటి తరగతిలో పరమపూజనీయ శ్రీ గురూజీ (మాధవరావు సదాశివ గోల్వాల్కర్) కూడా ప్రయాణిస్తున్నారు. ఒక ముఖ్య

విషయాన్ని చర్చించేందుకు వారు దీనదయాళ్‌జీని తమవద్దకు పిలిపించుకున్నారు.

దీనదయాళ్‌జీ రెండు స్టేషన్‌ల వరకు వారితో మొదటి తరగతిలో వున్నారు. తన పెట్టెలోకి తిరిగి వచ్చిన తర్వాత టి. టి. కోసం వెతికారు. తన వద్ద మూడవతరగతి టిక్కెట్టు వుండగా మొదటి తరగతిలో ప్రయాణించడం నియమాలకు విరుద్ధం జాతీయ సంపద యొక్క దుర్వినియోగం. వారి ఆలోచన ఇది. అందువల్ల వారు జాతీయ సంపదను ఇలా తాను ఉపయోగించుకున్నందుకు దాని విలువ చెల్లించాలని అనుకున్నారు. కొందరు తోటి ప్రయాణికులు వారి ఈ ప్రయత్నాన్ని చూసి ఎగతాళి చేశారు.

కొంచెంసేపటికి టి.టి.ఇ ని ఆయన కలుసుకున్నారు. విషయం అంతా చెప్పి తాను కట్టవలసిన అదనపు చార్జీ తీసుకోవలసిందని చెప్పారు. టి.టి.ఇ. ఇటువంటి వ్యక్తిని అంతకుముందెన్నడూ చూడలేదు. ఈయన దగ్గర మూడవ తరగతి టిక్కెట్టు వుంది. రెండవ స్టేషన్లు వచ్చే వరకు మొదటి తరగతిలో ప్రయాణించాడు. దానికి ఇవ్వవలసిన అదనపు చార్జీ ఇస్తానంటున్నాడు. టిటిఇ కాసేపు దీనదయాళ్‌జీ వైపు ఆశ్చర్యంగా చూశాడు. మారు పలుకలేక లెక్కకట్టి డబ్బు తీసుకున్నారు. 'మీకు రసీదు కూడా కావాలా?' అని అడిగాడు. పండిట్‌జీ వెంటనే 'తప్పకుండా ఇవ్వండి, ' అని అన్నారు. టిక్కెట్టుకు డబ్బులు ఇవ్వకపోతే నేరం అయినట్లే రసీదు తీసుకోకపోవడం వల్లటిటిఇ ఆ డబ్బులు తన జేబులో వేసుకోవటం కూడా నేరమే. ఇరువురూ దేశానికి నష్టంచేకూర్చే వారే. దీనదయాళ్ ఉపాధ్యాయ జీవించి ఉన్నంత వరకు ఇలా నియమాలను కఠోరంగా పాలించేవారు.

# అనాథలకు తల్లి

రామ్‌బాయీ వివాహమై అత్తగారింటికి వెళ్ళబోతోంది. అదే రోజున ఆ గ్రామంలోకి అకస్మాత్తుగా ఒక బాలుర గుంపు వచ్చిపడింది. 1869 సం.లో సౌరాష్ట్ర ప్రాంతంలో భయంకరమైన కరువు వచ్చింది. దానివల్ల ఎందరో మృత్యువాత పడ్డారు. తల్లితండ్రులను పోగొట్టుకున్న ఈ అభాగ్యులు దిక్కుతోచక అటు, ఇటు తిరుగుతున్నారు. గ్రామంలోని యువకులు ఈ బాలుర గుంపును చూచి, వీరు మనకెక్కడ దాపురించారు? మనకే సరిగా తిండిలేదు. వీరికి కూడ ఎక్కడ నుండి తెచ్చి పెడతాం? అని భావించారు. అందువల్ల వారు ఆ పిల్లలను తరిమితరిమి కొడుతున్నారు. అనాథలైన ఆ పిల్లలు అయ్యో, అయ్యో అనుకుంటూ పరుగెత్తుతున్నారు.

రాంబాయి వారి ఈ కేకలు, పెడబొబ్బలు విన్నది. ఆమె సహించలేకపోయింది. కోమలమైన ఆమె హృదయం కరిగిపోయింది. ఆమె పరుగెత్తుకుంటూ వచ్చింది. ఆ అనాథ బాలురకు గ్రామంలోని యువకులకు నడుమ నిల్చుంది. ఇలా హూంకరించి పలికింది, 'జాగ్రత్త, అసలే సగం చచ్చివున్న ఈ అనాథలను ఇంకా చంపటానికి ముందుకు రాకండి. ఈ అనాథలైన ఈ పిల్లలను కొట్టడానికి మీకు చేతులు ఎలా వచ్చాయి? మీకు సిగ్గులేదా?'

ప్రేమతో నిండిన హృదయంతో ఆమె ఆ బాలురను తీసుకుని గ్రామంలోకి వెళ్ళింది. తన తల్లితండ్రులతోను, అత్తవారింటి నుండి వచ్చిన బంధువులతోను ఇలా చెప్పింది, 'ఈ అనాథ బాలుర దుస్థితి నేను చూడలేను. ఆ భగవంతుడే వీరిని నా వద్దకు పంపాడా అని తోస్తోంది. ఇందువల్ల నేను వివాహబంధంలో చిక్కుకోకుండా నా సర్వస్వాన్ని త్యాగం చేసి ఈ అనాథలకు సేవ చేస్తాను. ఇది నా

నిశ్చయం. నాకు ఈ వివాహబంధం నుండి విముక్తి చేయండి.' రాంబాయి నిర్ణయం విని అందరూ చేష్టలుడిగి పోయారు. కుటుంబ సభ్యులు, బంధువులు ఎంతగా నచ్చజెప్పినా ఆమె తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. ఆమె ధృడమైన సంకల్పంతో ఉంది.

రాంబాయి ఈ బాలురను తీసుకుని భజన కీర్తనలు పాడుకుంటూ ఇంటింటికీ వెళ్ళి భిక్షాటన చేయసాగింది. ఆమెలోని ధృఢమైన నిష్ఠ, నిస్వార్థ బుద్ధి, త్యాగ భావన, భక్తితో చేసే సేవ చూసి ప్రజలు కూడా ఆమెకు విరివిగా సహాయం చేశారు.

ఆ యువతి అనాథ - మాత అనే పేరుతో ప్రసిద్ధి కెక్కింది. కొంతకాలానికి రాంబాయి అనాథాశ్రమం ప్రారంభమైంది.

తన జీవితం యావత్తు సేవా కార్యానికి సమర్పించిన రాంబాయి సేవా భావానికి మారు పేరుగా నిలిచి అద్భుతమైన ఉదాహరణ అయింది.

# పునాది రాళ్ళు

లాల్‌బహదూర్ శాస్త్రి లోకసేవా మండల్‌కు అధ్యక్షులైనారు. అప్పుడు ఆయనకు ఎంతో సంకోచం ఏర్పడింది. తన పేరు పత్రికలలో రావటం, తనను ప్రజలు ప్రశంసించటం ఇదంతా ఆయనకి ఇష్టంలేదు. ఒకనాడు శాస్త్రీజీ ని కలుసుకునేందుకు కొందరు మిత్రులు వచ్చారు. మాటల మధ్య వారు అడిగారు, 'శాస్త్రిజీ , పత్రికలలో పేరు పడకూడదని మీకు అంత నియమం ఎందుకు? పత్రికలలో పేరు రావటం మీకు ఎందుకు ఇష్టంలేదు?'

శాస్త్రీజీ గంభీర ముద్ర వహించారు. ఒక క్షణం ఆగి ఇలా చెప్పారు, 'లాలాలజపతిరాయ్ లోకసేవా మండల కార్యాన్ని నాకు అప్పగిస్తూ ఇలా చెప్పారు

'- లాల్‌బహదూర్, తాజమహల్‌లో రెండురకాల రాళ్ళు వున్నాయి. కొన్ని మంచి తెల్లని చలువరాళ్ళు. వాటిని ప్రపంచంలోని జనులంతా వచ్చి చూస్తుంటారు. వాటిని ప్రశంసిస్తుంటారు. మరికొన్నిరాళ్ళు వున్నాయి. అవి తాజమహల్‌యొక్క పునాదులలో వున్నాయి. అవి ఎప్పుడూ చీకటిలోనే వుంటాయి. కాని వాటిమీదనే తాజమహల్ నిల్చి వుంది.' లాలాజీ చెప్పిన ఈ మాటలు నాకు ఎప్పుడూ గుర్తు వస్తుంటాయి. ఎప్పుడూ పునాదిరాయిగానే వుండాలని నా సంకల్పం.'

నిస్వార్థ సేవా పరాయణులైన మహాత్ములు ఇలాగే చెబుతారు. పత్రికలలో పేరు పడటం, పూలహారాలు ధరించటం వంటి క్షుద్ర భావాలను వదలి రాష్ట్ర సౌధ నిర్మాణంలో నేను పునాదిరాయిగా వుంటాను.

# డబ్బు సద్వినియోగం

'అరే సుకాంత! ఈ రోజున ఈ అరటిపళ్ళ విందు ఎందుకు చేస్తున్నావు? ' సుప్రసిద్ధ రసాయన శాస్త్రాచార్యుడు ప్రఫుల్లచంద్రరాయ్ తన విద్యార్థిని అడిగాడు. గురువుగారు తాను చేసిన ఏర్పాటుకు సంతోషించారని సుకాంత అనుకున్నాడు. అందువల్ల వెంటనే జవాబు చెప్పాడు, పాలు, అరటిపళ్ళు కొంచెం ఎక్కువ తీసుకుంటే మీ ఆరోగ్యం బాగుపడుతుందని భావించి అర్ధణాకు బదులు ఒకటిన్నర అణాలకు అరటిపళ్ళు తెచ్చాను.'

'కాని అవసరాన్ని మించి ఖర్చు పెట్టడం ఏం తెలివి? నీవు డబ్బు ఎక్కువ ఖర్చు పెట్టావు. ఇది మంచిపనికాదు. సుకాంతా! ఈ రోజున అల్పాహారంలో అరటిపళ్ళు తీసుకోను. ఇంకా రెండు రోజుల పాటు కూడా తీసుకోను. ఇలాచేస్తే బడ్జెట్ సరిపోతుంది, పద ఈ అరటిపళ్ళన్నీ విద్యార్థుల అందరికీ పంచి పెట్టు. తింటారు.'

171
BAT



సుకాంత ఎంతో బాధ పడ్డాడు. తాను చేసిన ఈ పొరపాటు వల్ల [illegible] దాదా మూడు రోజుల పాటు అరటిపళ్ళు తినరు.

ఒక రోజున ఒక సామాజిక కార్యకర్త ఆచార్యప్రఫుల్ల చం[illegible] కలుసుకునేందుకు వచ్చాడు. మరొక కార్యకర్తకు ఆర్థిక [illegible] చేయవలసిందిగా అతను కోరాడు. ఆయన కష్టాలలో వున్నాడని [illegible] ప్రఫుల్లదాదా ఇలా అన్నాడు, 'అవును, మిత్రమా, ఆయనకు సమాజ[illegible] రుణపడివుంది. ఆయనకు మనం వీలైనంత సహాయం చేయాలి.' [illegible] సుకాంతాను పిలిచి తన బాంకుపాస్ బుక్ ను తెమ్మన్నారు. చూస్తే [illegible] 3,350 రూ.లు ఉన్నాయి. ఆయన 3,000 రూ.లకు చెక్కు [illegible] చెప్పారు, ఇది ఈ రోజే వారికి అందజేయండి. నేను త్వరలోనే [illegible] సహాయం చేయటానికి ప్రయత్నిస్తాను.

సుకాంత ఇదంతా చూశాడు. ఆశ్చర్యపోయాడు. సాహసించి గురువుగా[illegible] అడిగాడు, 'ఆరోజున ఒక అణా ఎక్కువ ఖర్చు పెట్టి అరటిపళ్ళు [illegible] మీరు అనవసరమైన ఖర్చు అన్నారు. ఇప్పుడు 3,000రూ.లు ఇవ్వటా[illegible] కించిత్తు కూడ సంకోచింపలేదు. ఎందువల్ల?'

'అవును, ఒక్కొక్కపైసా దాచిపెట్టినందువల్లనే ఒక మంచి పని క[illegible] 3,000 రూ.లు మిగిలాయి. బాబూ, మనం అనవసరమైన [illegible] చేయకూడదు. ఇతరుల మేలు కోసం నిండు హృదయంతో ఖర్చు పెట్ట[illegible] డబ్బు సద్వినియోగపరచటమంటే అదే.'

సుకాంత గురువుగారి పాద ధూళిని శిరస్సుపై చల్లుకుని ధన్య[illegible] అనుకున్నాడు.